Higher Grade
1925. T. S. L. C. Examination Detailed Text.

శ్రీ

# చిత్రభారతము.

[ వచనము ]

---

సువర్ణముఖి, గంగాబాయి, దుర్యోధనపరాభవము, బుద్ధిసాగరవిజయమునుల
గ్రంథకర్తయగు

వల్లి వేంకటసుబ్బారావుచే

రచియింపఁబడి

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు
డి. కే. పంత్ చే
ముద్రింపఁబడి

గుంటూరు బందరు
"వి. వి. రమణయ్య అండు సన్" వారిచే
ప్రకటింపఁబడెను.

రెండవకూర్పు : 1000.

1923.



వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

DEDICATED

TO

THE SACRED MEMORY

OF

My Reverend and Affectionate Father

PALLE VENKATA RAMANIAH.

(Expired 9th May 1919)



# విజ్ఞప్తి

చరిగొండ ధర్మన్న. ఈ కవి నియోగిబ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; తిమ్మయ పుత్రుఁడు. ఇతఁడు చిత్రభారత మనెడి యెనిమిదాశ్వాసముల గ్రంథమును జేసి దీని నిమ్మలపల్లి పెద్దనామాత్యున కంకితము చేసెను. కవి శతలేఖనీసుత్రాణ బిరుదము గలవాఁడై శతలేఖ న్యవధాన పద్య రచనయందు సమర్థుండనియు, తెలియవచ్చుచున్నది. ఈ ధర్మకవి యించుమించుగా తెనాలి రామకృష్ణకవికాలపువాఁడు. కవిత్వ మసర్గళమయిన ధారకలదయి సలక్షణముగా నున్నది.

ఆర్యులారా!

మనోహరం బగు చిత్రభారతంబును బఠింపఁ గథా సంగ్రహంబును వచనరూపమున రచియింప వాంఛ జనింప నిందులకుఁ గడంగితి. ఇం దచ్చటచ్చటం జేర్పఁబడిన పద్యంబులు చిత్రభారతములోనివే. నా వచనరచనయందుఁ గల లోపంబులకుఁ బాఠకమహాశయులు మన్నింపఁ బ్రార్థితులు.

ఇట్లు విధేయుఁడు,

వల్లె వేంకటసుబ్బారావు.

# రెండవకూర్పు పీఠిక.

ప్రాజ్ఞశేఖరులగు నో యార్యులారా!

భగవదనుగ్రహమువలనను, పెద్దల యాశీర్వచనబలము చేతను, ఆంధ్రభాషాభిలాషుల యాదరణమువనను "చిత్రభారతము" రెండవకూర్పునకు అవసరముకలిగెను. పఠనీయగ్రంథముగ నంగీకరించినందుకు విద్యాశాఖవారికి, తమతమ పాఠశాలలలో నియమించి నాకు ప్రోత్సాహము నిచ్చినందుకుఁ బాఠశాలాధికారులకు, 1925 ట్రెయినింగుస్కూళ్ళ హైయరు గ్రేడు పరీక్షకు దీనిని పఠనీయగ్రంథముగ నేర్పఱచినందులకు విద్యాశాఖవారికి నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను.

గుంటూరు,
21—8—23.

ఇట్లు విధేయుఁడు,
వల్లె వేంకట సుబ్బారావు.



శ్రీ శ్రీనివాసోవిజయతే.

# చిత్రభారతము.

---

నైమిశారణ్య మఖిల మునిశరణ్యమై వెలయుచుండె. అప్పుణ్యక్షేత్రంబున నానావృక్షజాతులును, లతావితానంబులును, సకల కాలములయందును ఫలించుచు, పుష్పించుచు, విబుధాళులకు ననుదినంబును నుపయోగార్హంబులైయుండు. వెండియు నందుఁగల యనేక జంతువు లన్యోన్య వైరంబులుడిగి యత్యంత సంతోషంబున విహరించు. ఆహా! సాధుసజ్జన సాంగత్యంబున నోరులేని జంతువులుకూడ నైజదుర్గుణంబుల మాని సంచరింప నేర్చె. ఈవనంబున మున్నొకనాఁడు పావనశీలురగు శౌనకాది మునిశ్రేష్ఠులుగూడి సత్రయాగము నొనర్ప నుపక్రమించిరి. అమ్మహత్తరమగు క్రతువును సందర్శింప సకల వేదవేదాంగ విశారదులగు మునులును, యతులును, విద్వాంసులును పెక్కు-రేగుదెంచిరి. వీరలంజూడఁగోరి తపో విద్యాధనుండును, విమలాచారుండును నగు సూతుండును జనుదెంచె. వారును నాతని సుఖాసీనుంగావించి యాతని మృదు

మధుర భాషణంబుల శ్రవణానందంబుగ వినవించి యిట్ల నిరి:—

"తాపసోత్తమా! సమస్త పురాణంబులును, తమ మనఃకమలమునసే భద్రముగ నున్నవందురు. ఏదియేనొక్క దానిని దమ యవిరళ వాగ్ధారచే వచించి మాకెల్లరకుఁ బ్రీతి నొనర్పుము."

రోమహర్షణతనయుండు వారి పల్కులాలకించి 'మునివరేణ్యులారా! పుణ్యచరిత్ర మొక్కటిదెల్పెద దత్తావధానులై వినుం'డనియె. వ్యాసప్రోక్త పురాణములలో బ్రహ్మాండమను పేరంబరగునది యొకటి గలదు. అందు నేఁ జెప్పఁబోవు కథ వివరింపఁబడియున్నది. తొల్లి పాతాళభువనంబున, భోగవతి యను పురం బొండుండె. దానిని, ఇలావంతుఁడను రాజు పాలించుచుండె. అతఁడు షష్ఠాంగలక్షణయుతంబై వెలుంగుచున్న నిండుపేరోలగంబున నవరత్నకలిత కనకాసనంబున నాసీనుఁడైయుండె. ఆ కొల్వుకూటమున శ్రీహరినామంబు స్మరించుచు, శుకయోగీంద్రుఁడు ప్రవేశించెను. రాజు శుకునిఁ గాంచి భక్తిపూర్వకంబుగ నమస్కరించుచు నెదురేగి యర్ఘ్యపాద్యము లొసఁగి గౌరవించె.

అంత సుఖాసనాసీనుండైన యోగీంద్రుని రాజిట్లని ప్రార్థించె.

"మహాత్మా! తమ కెఱుంగని దెయ్యదియును లేదు. మిగుల నాశ్చర్యహేతువైన కథ నొక్క దానిని నాకు నానతిండు."

అనవుడు నీలావంతునకు శుకయోగి యిట్లు చెప్పం దొడంగె.

## —♦ తుల్యముని చరిత్రము. ♦—

రాజా! తొల్లి తుల్యుం డను మునిసత్తముఁ డొక్క డుండె. అతఁడు సుఖదుఃఖములను సమముగఁ దిలకించు మహాత్ముఁడు. సుహృజ్జనంబుల యెడలను, నమిత్రుల యెడలను సమభావంబున మెలంగు పుణ్యాత్ముఁడు. అతం డాంతర బాహ్యంబు లేకంబుగఁ జేసి పరమాత్మఁ గూర్చి నిశ్చలతపంబు భాగీరథీ నదీతీరంబున నాచరించుచుండె. విమలమతి నాతఁ డొనర్చు తపస్సునకు ముల్లోకములవార 'తారా' యని పొగడం దొడంగిరి.

ఇంతలో గ్రీష్మకాలము వచ్చెను. మధ్యాహ్నపుం డుగ్రుం డై జగంబులఁ గాల్చుచుండుటచే జలచరంబులు నిలువ నీడ లేక యుడికిపోయెను. ఎండకాలపు మబ్బులో యున, ధూళి సమాక్రాంతంబులగు పెనువాయువు లెల్లెడలఁ బ్రబలియుండె. అతి గంభీరంబులైన నదీప్రవాహంబుల నీరెల్ల ఇంకి యిసుకపఱ్ఱ లయ్యె. వర్షమునకు సహించి యిటునటు మెదలనగుఁ గాని యీనిప్పుల వర్షమునకు మాత్రము వెలిచి యొందేని దాఁగి యుండుటయే శరణ్యము.

ఇట్టి సమయమునఁ గూడ తుల్యమహాముని తపస్సమాధినిఁ జలింపకుండె. వామపాదపు బొటనవ్రేలిమాత్రము భూమిపై నిలిపి హస్తద్వయంబును బైకెత్తి రమావల్లభుని నాత్మ

పీఠముననిల్పి యుగ్రుండైన ప్రభాకరునిపైఁ జూడ్కులు నిగిడించి పంచాగ్ని మధ్యంబునఁ బరమాశ్చర్యంబుగ నిలిచియుండె. హేమంతమునఁగూడఁ గుత్తుకబంటినీటిలో నిలిచి యంబుజహితుని నాత్మనిల్పి యమ్మాని కుంజరుండు తదేకదీక్షను గరుడ గంధర్వయక్ష కింపురుష సిద్ధ సాధ్య విద్యాధరాదులు సన్నుతింపఁ దపంబుఁ జేయుచుండె.

—♦చారులు తుల్యునివిషయము నింద్రున కెఱింగించుట.♦—

ఇట్లుండ నింద్రుం డొకనాఁడు లోకములలోని చిత్రములరసి రమ్మని చారుల నంపఁ దలంచె. చారులే రాజులకు దూరపు వస్తువులను గనఁజేయు కన్నులు. వారిమూలముననే ప్రభువులు మేలుకీళ్ళెఱయ దక్షులు. వారును గడునేర్పుతో సంచరించి నిజానిజంబు లారసివచ్చి యేలికకుఁ దెలుపుదురు. వాసవుఁడు విమలాచారులగు నిత్య గూఢచారులఁ జేరఁబిలిచి యిట్లనియె.

చారులారా! మీరు భూపాతాళలోకంబుల కేఁగి రావలయును గౌరవార్హులగు భూసురులు వేదవిధి నతిక్రమింపక సంచరించుచున్నది లేనిదిఁ గమనింపుఁడు. రాజులునీతివిశారదులై ప్రజాపాలన మొనర్చుచున్నది లేనిది శోధింపుఁడు. ప్రవీణులైన వైశ్యపుంగవులు ధర్మబద్ధులై పుణ్యమతితో నున్నదియు లేనిదియు విచారింపుఁడు. నాల్గవజాతివారు సద్వర్తనము గలిగి ప్రవర్తించుచున్నది లేనిది కనుఁగొనుఁడు. నియమబద్ధులై ప్రజాళి చరించుచున్నదియు లేనిదియు వీక్షించి రండు. యోగీంద్రులు నిర్మలచిత్తంబుతో బ్రహ్మనిష్ఠాగరిష్ఠులై తపం బాచరిం

చుచున్న దిభేషజంబున త్రైలోకులహో నగించుచున్న దివరికింపుడు. బ్రహ్మచారుల నిష్కల్మషచర్యలును గృహస్థుల సదాచారములును పతివ్రతల పతిభక్తియు, యోగ్యుల దైవభూసురాతిథిపూజలయం దనురక్తియు శ్రద్ధాసక్తులై పరికింపుఁడు.

అట్లు స్వామిచే ననుజ్ఞాతులై చారులు ధరణీతలంబునకుఁ జేరిరి. సమస్తవస్తువిస్తారంబులగు సప్తద్వీపంబులును దేదీప్యమానంబుగ వెలుంగు నవరత్నజాలంబులకు నిలయంబులగు పర్వతంబులును, మునిగినమాత్రంబున మహాపాతకంబులనెల్లం బాయఁజేయు సమర్థంబులగు తీర్థంబులును, పవిత్రంబులగు పుణ్యక్షేత్రంబులును, భూజనులను గనుంగొనుచు జరించుచుండిరి. అట్లొనర్చునెడ నొకనాఁడు కనులమూసికొని హస్తద్వయంబును నూరువులకానఁ జేసి సర్వేంద్రియనిగ్రహంబొనర్చి శ్రీవరు మనోజలజంబున నునిచి మానసా యర్చించుచున్న తుల్యముని చంద్రుఁగాంచి భయభ్రాంతులైరి.

ఒకచారుఁడు—ఈపరమహంస లోకములపీఁచమడంచుటకు నిట్టితపముఁ జేయుచున్నట్లున్నది.

రెండవచారుఁడు—కొంపఁదీసి ఈశ్వరుఁడు కాఁడుగదా?

మూఁడవచారుఁడు—శూలమేది? కానరాదే. నీ తెలివి తెల్లవారె. మూఁడవకన్ను లేదుగదోయి.

రెండవచారుఁడు—వాణీభర్తయై యుండనోపు.

మూఁడవచారుఁడు—అట్లైన చతుర్ముఖము లేవి?

రెండవచారుఁడు—నిశ్చయముగ నీతఁడు రమాధవుడే.

మూడవచారుఁడు—నీకేమి మతిపోయెనా? శంఖ చక్రంబులేవి? కానరావే

మొదటి చారుఁడు—నాయనలారా! ఎందుకయ్యా మీవాదము? ఈతఁడొక మునిసత్తముఁడే. నమ్ముఁడు. ఈతఁ డిద్దాని నపేక్షించి యిట్టిఘోరతపంబొనర్చుచున్నాఁడో కదా? భయంకరముగఁ బ్రసరింపుచున్న యిమ్మునిశ్రేష్ఠుని తేజమున నెల్లలోకములు స్రగ్గవే. వాయువులేనిచోట దీపంబుచుంబోలె నీమహాత్ముండిట్టి యచలభావంబున వెలుఁగుచున్నాఁడు! కావున మనమిప్పుడు వాయువేగ మనోవేగంబులకన్న మిన్నగ దివమునకరిగి సురేశ్వరున కీవార్తవినిపింపవలయు. లేకున్న మోసము వాటిల్లుట నిక్కువము.

అట్లు చారులు కృతనిశ్చయులై యతిత్వరితగమనంబున నాకలోకంబునకేగి యమరేశ్వరుంగాంచి దండప్రణామంబు లాచరించి యిట్లనిరి.

"దేవరా! తమపంపున ధర కతిత్వరితంబుగ నేగితిమి. పావనులైన భూసురులను పార్థివులను బరికించుచుఁ బుణ్యతీర్థంబులను మహానదులను దిలకించుచుఁ బట్టణంబులు వనంబులు గ్రుమ్మరుచుఁ దుదకు జాహ్నవీ తీరంబుఁ జేరఁబోయితిమి. అట నొకముని సత్తమునిం గాంచితిమి. అతఁడు ఛండాంశునిఁ బోలె నుగ్రతేజస్ఫూర్తిఁ బ్రకాశించుచుండె. మహాప్రభావంబున ఫాలాక్షుండేయన నొప్పు. వేయేల? త్రిమూర్తులొక్కటై యావిర్భవించిన ట్లాతని రూపము కన్పట్టె. కావున నమ్మహామునీంద్రుఁ డేమినిమిత్తమున నిట్టితపంబుఁ జేయుచున్నాఁడో

దానికిందగిన కార్యంబూహించుటయత్యంతావసరము. అతని నామధేయము తుల్యమహర్షి యట.

## ఇంద్రసభ.

జంభారి చారులవలన నెఱింగిన సమాచారంబు వలన నేమికీడు రానున్నదోయని దురంతచింతాక్రాంతుఁడై సభాస్థలికేతెంచి దిక్పాలురను సకల దేవతావరులను గురునిం దోడ్కొనిరమ్మని ప్రతీహారులంబంపె. వచ్చినవారల యథోచితంబుగ సత్కరించి తాను భద్రచింతామణి పీఠికాసీనుండై యిట్లనియె.

సభాసదులారా! చారులవలన ధరణీస్థలియందుఁ దుల్యుఁడను మహర్షి దీర్ఘనిష్ఠాగరిష్ఠుఁడై వినికనరానిరూపమున ఘోరతపంబుఁ జేయుచున్నట్లు వింటి. అయ్యది ప్రపంచ సంచలనంబునకుఁ గారణమగుట నిక్కువము. కావునఁ దుల్యముని తపంబునకు భంగంబొనర్చి ధరణికి నాకపదఁ బాపుటయు మనసౌఖ్యంబును రక్షించుకొనుటయు నత్యంతావసరము. తమరెల్లరును యోచించి యుపాయంబుఁ దెల్పుఁడు.

గురుఁడు—పాకశాసనా! మేమెల్లరమునుఁ గలియఁ బలుకుకొంటిమి. జలనిధిని నావ చేఁదరించునటు లుపాయబలముచే నెట్టిబలవత్తరమైన కార్యమునైనను సాధింపనగు. మునీంద్రులు బహిరింద్రియంబుల మనంబుతోఁ గలిపికొని యచలత్వం దపంబొనర్తురు. కావున మనంబుఁ జెదరునట్లు చేసిన తపంబు భగ్నంబగు. ఈక్షణంబున మనసిజుని రావించి

మునీంద్రు మనమును జేర్పున హరింపఁ బాపుము. ఇక్కార్య మాతని మూలముననే సాధింపఁబడవలయును. అతనికిఁదోడుగ నచ్చరలంగూడఁబంపినఁ గార్యము త్రుటిలోఁగట్టెక్కు. మాను లతపంబులకు మనయచ్చరలే మారకగ్రహంబులు.

పురందరుండు సావధానమతిని గురుని పల్కులాల కించి తెలిపిన యుపాయంబునకు నభినందించుచుఁ గందర్పుం దలంచె. అతఁడును మిత్రుండగు వసంతుఁడు చామరంబును వీచుచు వెంటరాఁగా సమరేంద్రుఁ జేరెను. ఇట్లు వచ్చిన భావ సంభవుని సురేంద్రుం డాలింగనంబు సేసి గారవించి సుఖాసీ నుం గావించి కుశలంబడిగిన యనంతరంబ రంభం దలంచె! వెంటనె రంభయు దేవాధినాథు కొలువునకు, కృతాంజలియై ప్రవేశించె. అంతవారలకు జంభారి కార్యభరం బెఱింగింపం దలంచి తొల్తఁ బంచబాణునికిట్లనియె.

అనఘా!

క. హరిహరకమలభవాదుల
సరకుఁగొనక గెలుచునీకు సామాన్యమునీ
శ్వరులను జయించుటనఁగా
సరకా నరకాంత కాత్మ సంభవతలపన్

వినుమొక్కకార్యంబు వినుపించెద. భూతలంబునఁ దుల్యుండను మునీంద్రుండు దారుణంబగు తపంబుఁ గావింప లోకంబులు చికాకుపడియెంగావున నతనితపంబునకువిఘ్నంబు సేయవలయు. నీకు సహాయంబుగ రంభాది దేవతాంభో జాక్షుల నంపెద. వైళంబ చనవలయు.

మన్మథుఁడు—రుద్రుఁడును బ్రహ్మయు నాకుఁ దృణప్రాయులైరి. నాకు మునులన్న నొకలెక్కయా? మద్ధనుః ప్రభావంబునఁ బౌరుషవృత్తిమాని పడఁతుకలుగారా? దేవా! అమ్మునితపంబు వారించి నీకు మెప్పుఁబుట్టించెదఁ జూడుము.

ఇందిరానందనుని పల్కులచే నింద్రుం డవిచ్ఛిన్నంబగు సంతసంబున నవర్ఘ్యమణి భూషణాంబరాదులు పెట్టగట్టనిచ్చి ప్రియపూర్వకంబుగా ననిపె.

ఆ పిమ్మట రంభం గాంచి యిట్లనియె.

తరుణీ !

క॥ ధరణీతలమున యోగీ
శ్వరుఁడొక్కఁడు తుల్యుఁడనఁగ సంతత నిష్ఠా
పరుఁడై తపఁమొనరింపఁగఁ
దరణీ భువనంబులెల్లఁ దల్లడమందెన్.

క॥ కావున భువనత్రయమును
గావుము నను బ్రోవు తుల్యు ఘనతపముడుపం
గావు నయోపాయంబులు
వేవేలును నీవుదక్క విమలేందుముఖీ.

రంభ—స్వామీ! నావిన్నపమాలకింపుము. నీయెదుట నిచ్చకములు పల్కుటకు నే నొల్లను. ఇతరులు బుద్ధిమాలి పల్కినఁ బల్కనిండు. కార్చిచ్చునఁదగు సమ్మహాత్ముని చిత్తము నొచ్చినఁ గీడునిక్కువము. కందర్పుఁడు చెల్లాటముగ హరుపై,

జని యేమిగతి గాంచె. ఐనను నీయాజ్ఞ యనుల్లంఘనీయమగుటఁ దుల్యుని కడకేగి నా నేర్పుపంతయుఁ జూపెదఁగాక.

అనిమిషనాథుని చిత్తం బప్పద్మలోచన పల్కులచే స్వస్థతఁగాంచె. రంభకును సహస్రలోచనుఁడు భూషణాంబరాదుల నొసఁగి యనిపె.

—* తపోభంగ ప్రయత్నములు. *—

ఇంతలో వసంతకాలము సమీపించె. మేఘుఁడను వర్తకుఁడు భూరుహములను ప్రజలకు నప్పులొసఁగి పైకమును వసూలుచేసికొనిరా వసంతునకుఁ బనుపఁగా బణమునొసఁగలేక పత్రములొసఁగఁ గాఁబోలు నన్నట్లు తరువులు వసంతాగమంబగుటఁ జేసి పత్రంబులరాల్చె. ఇవ్వసంతసమయంబున నిర్మలప్రచారుండును, నిర్వికారుండును నగు తుల్యుం డుగ్రతపంబుఁ జేయుచుండె.

నెయ్యంపుఁ జెలులతోఁ దుల్యముని యున్న వనంబున కేతెంచుచుఁ దన మనంబున రంభ యిట్లనుకొనుచుండె.

దేవేంద్రుని యాజ్ఞ కాదనరాని దాటఁ దరలివచ్చితిని. ముని చెంతఁ జేర నాతండు కినిసి యేమనునో, కార్య మెవ్విధి నగ్గించి స్వామిని సంతసింపఁజేయఁగలనో, మోసగింపఁబడునో, విఫలప్రయత్ననై తపసి యాగ్రహమునకుఁ బాత్రురాలనగుదునేమో. చనకున్న బలారి కందు. రంభ యిట్లు తలపోయుచు నధైర్యము వెనుకకులాగ భీతము ముందునకు నడుపఁ దొందరింప నెట్టకేల కవ్వనప్రదేశ మొనర్చె. సఖసమేతయై యా

నలంతుక వనం బెల్లెడలఁ గుమ్మరుచు రామణీయకంబుఁ గాంచి వర్ణించుకొనుచుండె. పోవంబోవ రంభాదులకొక సరస్సు గాన నయ్యె. వారికానరస్సున సలిలక్రీడలఁ దేర నాసక్తిజనించి భూషణంబు లొలిచి తత్తీరంబున నునిచి వస్త్రంబుల బిగించి కొలనిలోఁ బ్రవేశించి జలక్రీడావినోదంబులు సలిపి యలసటం జెంది చాలించి యందుండి వెలువడిరి. తదుపరి వారు చీని చీనాంబరములను మనోజ్ఞభూషణంబులను, మంజులమాల్యంబులను ధరించి మెల్లమెల్లన నటు నిటు సంచరించుచుఁ జని చని తుల్యఁగాంచిరి. అతని యాకార విశేషంబులం గాంచి యందఱును ఫక్కుమని నవ్విరి. ఒక వికచరాజీవనేత్ర సాహసించి యాతని మోమున మోముంజేర్చి నవ్వుచు వ్రాయరాని పలుకులఁ బల్కఁదొడఁగె. మిగిలినవారును వారు నేర్చినకొలఁది మోహపరవశునొనర్పఁ బ్రయత్నించుచుండిరి. మునీంద్రుఁడు మాత్రము స్థాణువుచందంబుననుండి హృదయకమలంబున సనకసనందనాదులచే సంస్తూయమానుండును, పీతాంబర ధరుండును, శంఖచక్రగదాదిలాంఛనకలితకరకమలుండును, సకల భక్తపరాయణుండును నగు శ్రీమన్నారాయణమూర్తిని నిల్పి నిశ్చలుఁడై యుంట రంభ యెఱింగె. ఎఱింగియు రంభ తన సౌందర్యగర్వంబు పెంపున నాతని సరసంజేరి వీణెమీటుచు రెండవశారదయో యనునట్లును అవ్వనంబునంగల మోళ్లు చిగిరించునట్లును, పక్షులాహారంబులు మాని పాటకు హాయిగా నానందించునట్లును, రాలు కరఁగునట్లును పాడుచుండె.

ఇట్టిదియె సమయంబని మదనుండు తనబలంబున కుశ్రి
మించు నెలవ్రపంగి గుణములనందించివదలె. బ్రహ్మానందమున
దేలుచున్న సంయమీంద్రునకు రంభ పాట యానందము
గూర్చుచేటిమాట. అంతఁ గొంతవడికి ముని యించుక కన
లెత్తిచూచె. తులువుఁ డాపూఁబోడింగాంచి సౌందర్యంబు
కాశ్చర్యమొంది నెమ్మనంబున నిట్లనుకొనియె.

గీ॥ పలుక విహరింప నేర్చిన పసిఁడిబొమ్మ
రూపు గైకొని మెలఁగు మెఱుంగు దీఁగె
ప్రాసఁగఁ జైతన్య మొందిన పుష్పలతిక
గాని యిది కాంతయని నమ్మఁగాదు మదిని.

అట్లా యోగివల్లభుఁడు నాలేమ సకలావయవంబుల
గాంచుచు బ్రహ్మసృష్టిసామర్థ్యంబు నెంచుచుండె. తెప్ప
ర్పకఁ దన్ను వీక్షించుచుండుటఁ బట్టి యుయ్యతివరుం డాత్మ
ధీనుండయ్యెనని రంభ ధైర్యము వహించె.

అంత నా రమణీ శిరోమణి యొయ్యారముగ లేచి
నిలిచి వినయముమీఱ హస్తయుగ్మము మోడ్చి సంభ్రమ
మున నిట్లనియె.

"స్వర్గలోక సౌఖ్యంబుల నపేక్షించువారికెల్లరకు నా
క్షణయంత్రమునగు నే నిదే నిను దర్శింపవచ్చితి. అట్టి నన్నా
రింపకుంటుట న్యాయమా ? తనువు నింతగ నెవ్వఁ జేసికొని
పొందనున్న బ్రహ్మానందకేళి యీ రంభానందకేళి కంటె
మిన్నయె? నాతోడ దివ్యభోగంబుల ననుభవింపుము."

ఇట్లు తనవాక్సుధారసంబుచే నాతని నభిషిక్తునొనర్చి తనవిలాసంబుల కాతనిమనంబు కరఁగెననియు నా కలికి బ్రమసి "నీవిట్లాలసించి నావలపుఁదీర్పకున్న నేనెట్లు తాళుదాన మునినాథా" యంచు నాతని కరం బల్లన నంటె. ముని దాని చేతకు రోసి ముల్లోకంబులు సంక్షోభంబున గజగజవడంకఁ గంఠారావం బొనర్చి మహాకోపస్ఫురితుం డై శాపోదకంబులఁ గేలం బూని యప్పడఁతుకం గాంచి యిట్లనియె.

ఉ. ఓసి దురాత్మురాల వినయోక్తులచే నను వెఱ్ఱిఁ జేయుపే
రాసలు మానునిన్ను చెద లంటఁగఁ జేర్చు నె బల్మిఁ బైఁబడం
గా నమకట్టి చేరితివి గానఁ దురంగముపై చరింపు నీ
మైసాబగెల్లఁ బొల్లువడ మర్త్యుని మీఁది ధరాతలంబునన్

అని శపియించె.

దాన దివాచంద్రబింబంబు రీతి రంభాముఖారవిందము వెలవెలఁబాఱె. పద్మములవోలె వికసించి ప్రకాశించుచున్న నేత్రయుగ్మంబు నశ్రువులతో నిండి ముకుళించుకొనిపోయె. గంభీరకంఠస్వరంబు డగ్గుత్తికగ మాఱె. పెనుగాలిచేఁ గంపించు వల్లికభంగిని, తనువు గడగడవణఁక మొదలిడె. తుదకుఁ బెను మూర్ఛచె ధరణిఁ వ్రాలె.

అయ్యెలనాగ కొంతతడవునకు మనోదార్ఢ్యమువహించి లేచి మునికి సాగిలఁబడి మ్రొక్కి లేచి నిలిచి యిట్లు విన్నవించుకొనియె. "అనఘా! పిచ్చుకపై బ్రహ్మాస్త్రమన్నట్లు నా [illegible]నా యింతకినుక? నేనిట్టు లట్టికష్టంపు రూపంబునఁ జరింప [illegible]వ? నన్నెట్టులైన ననుగ్రహించి యీదుర్దశనుండి పావవే.



గారాబంబున నలకూబరుని కౌఁగిటవసించు నాయెడనిట్టి యాగ్రహమూన న్యాయమా? అని యుద్వేగంబున నతిదీనయై విన్నవించుకొనుచు నడుఁగడుగునకు మునీంద్రు పాదారవిందంబులకుఁ బునః పునః ప్రణామంబు లాచరించుచుఁ గాలువలుగట్టఁ గన్నీరుగార్చుచుండెను. ఆ పిమ్మట నిట్లనియె.

గీ॥ ఎంతకాలంబునకు నాకు నేనెపమున
శాపమోక్షంబు గల్గెను సజ్జనాగ్ర
గణ్య! నీ నెమ్మనంబునఁ గరుణఁ జేసి
యానతీఁదగు నశ్వతిఁ బూనఁబాల॥

తుల్యముని — తరుణీ! దుఃఖింపకుము. శాపమోక్షక్రమ మాలకింపుము. చతుర్ధనుఁడనురా జుర్వరఁగలఁడు. ఆతనికిఁ బురాకృతసుకృతంబున మేనితోడనే దేవలోకాదులఁ గాంచ ననువగు. ఆనృపతికి నీవు వాహనంబవై లోకంబులఁ జూపి గ్రమ్మఱిన పిదపఁ దొల్లిఁటి రూపుఁ గాంచెదవు. పొమ్మనియె.

(చతుర్ధనమహారాజు చరిత్రము.)

కుండినపురంబు నేలు రాజు చతుర్ధననామంబునం బరఁగు. ఆతేఁడు వినయవివేకశాలియు, శత్రువీరభయంకరుండును నై రామ, నల, భగీరథ ప్రముఖులట్లు పుణ్యమూర్తియునయియు ననింద్యచరిత్రుండనియుఁ బేరెన్నికఁ గాంచి పరిపాలన మొనర్పుచుండె. ఆతం డొకనాఁడు మండలనాథులును, హితులును లోనగువారితో నిండుకొలువుండునెడ, నరణ్యమున నుండి యొక చెంచుదొర యోలగంబునఁ బ్రవేశించె.

గీ॥ వచ్చి కమసంభ్రమంబున వసుమతీంద్రు
నంఘ్రులకు మ్రొక్కి భూరియుపాయనము లెల్ల
సమ్ముఖంబునఁ బెట్టి హస్తములు మొగిచి
తనవచఃప్రౌఢి మెఱయ నిట్లనుచుఁ బలికె॥

అతని మూలమున భూపాలుఁడాటవికుల క్షేమం బెఱిఁగి క్రొవ్విన క్రూరమృగావళులు లెక్కకుమిక్కుటంబుగఁ గ్రుమ్మరుచున్న వను వార్తవిని వేటకేగ నుత్సాహంబు పొడమ పోటుమానిసులగు వేటరులఁ బిలువ వేత్రహస్తులం బంపె.

అంతఁ దానుమృగయోచితంబగు శృంగారంబు నలంకరించుకొని రథారూఢుండై సంతోషభరితాంతరంగుండై వేటాడ నేగుచుండె. పులిసగొణ్ణెపిల్లను వలఁబట్టి భుజముపై వైచుకొని వచ్చెదమనియు, సింహంబును ప్రాణంబులతోనె కనుగట్టి తెచ్చెదమనియు, శరభంబును ముక్కుకట్టి యీడ్చుకొని వచ్చెదమనియు, నిజప్రతాపంబులను కెంచులు సాటుచు ముందు దారితీయుచుండిరి. విపినప్రవేశ మొనర్చి మృగంబులఁ దునుమాడి యంతరంగంబున సంతసంబంది వేటఁజాలించి భిల్లులు ప్రాణంబులతోఁబట్టి తెచ్చిన కస్తూరిమృగంబులను శరభంబులకుఁ దల్లులగు జవ్వాజిపిల్లలను గొని వారికిఁ బసిదనంబులు కొల్లలుగనిచ్చె.

క॥ మనమున మృగయాక్రీడలు
గొనియాడుచు బలములెల్లఁ గొలువ నిజస్యం
దనమెక్కి ముదంబున నా
జననాయకుఁ డాత్మపురికిఁ జని తనమెదుటన్॥

అంత నతఁడొక యశ్వరాజంబుఁ గాంచెను. నిక్కువముగ నిదిసురలోకములోనిదే యనియు యక్షలోకంబునుండి దారితప్పి వచ్చెనేమో యనియు దానిలక్షణ లక్షితాంగంబుల నివిరి దాని చందంబునకు నబ్బురమంది దానిఁ గొనిరా సేవకున కాజ్ఞాపించె.

అంత నొక్కనాఁడు భూజాని పేరోలగంబుననుండి మంత్రులతో నిట్లనియె.

క. ఏవనమున వేఁటాడం
గా వేఁడుక నేఁగ నచటఁ గలిగినతురగం
బే విధమున మెలఁగెడినో
యావిధ మెఱుఁగుటకు నెక్కియాడఁగవలయున్.

క. కావున మీరీక్షణమున
దైవజ్ఞులఁ బిలిచి చంద్రతారాబలమున్
భావించి శుభముహూర్తము
దీ విలసితులగుచుఁ దెలిసి తెండు హయంబున్.

అంతఁ జతుర్థనభూనాఁథుండు నిజాభ్యంతరమునకుం జని జలకం బాడి యలంకృతుండై యిష్టదేవతానమస్కారంబు గావించి షడ్రసోపేతరుచిరాన్నంబుల భుజియించి కర్పూరతాంబూలం బాస్వాదించి యశ్వారోహణకుతూహలుండై యంతఃపురంబు వెలువడియె.

గీ. సంతసమునొంది మేదినీకాంతుఁడపుడు
గన్నుసన్నల నిజమంత్రిగణముఁ బిలువ

నదియు సుముహూర్తమంచు నా హయముఁదెచ్చి
నిండువేడుకతో ప్రోలనిల్పుటయును.

చిత్రవిచిత్రగతుల నలంకరించి తేఁబడిన హయోత్తమంబునుం గాంచి నాపార్థివోత్తమునకు నేత్రపర్వంబయ్యె. అంతనాతఁడు పెద్దలదీవనలంది యుత్తురగారోహణంబు గావించి సంతోషభరితాంతరంగుండై చతురంగబలంబులుగొలువ రాజమార్గంబునఁ జనుచుండె. ఇవ్విలాసంబును వీక్షింపఁ బౌరులు ధర్మహర్మ్యంబుల నిలిచిరి.

చ. కొదమమహాతురంగమును గోరికలీరికలెత్త నెంతయున్
బెదరఁగనీక యుల్ల నడిపించెను వీధులుచూపఁబూని త
త్పదముల యందియ ల్చెవ్వులవందువగా మొరయంగ దేహమున్
గదలనియట్ల తోఁచు మెడఁగట్టిన జంగె గణంగి మ్రోయఁగన్॥

అట్లు సనుచున్న కారణజన్మంబగు యుత్తమాశ్వంబందుఁగల వారెల్ల రక్కజంబున హాహా! యన, పుడమిఱేనితో రివ్వున గగనంబు కెగసె. అదిగాంచి మంత్రి పురోహిత సేనాపతి ప్రముఖులగు జనంబులు చింతిల్లుచు నూర్ధ్వముఖులై పలుమార్లు చూచుచుఁ బురప్రవేశ మొనర్చిరి. దుఃఖభరంబున సొక్కుచున్న యంతఃపురజనంబుల మంత్రు లూఱడింపనేఁగిరి. అటు చతుర్ధనుఁడు మందాకినీ తీరంబుఁ జేరునరికి నారదుం డాతనిఁ గలిసికొని యిట్లనియె.

"నరనాథా! ఈ వారువంబు నీకు దివ్యభువనంబు లన్నిటిం జూపి స్వస్థలంబుఁ జేర్చు.

భయపడకుము. అవసరముగఁ బోవుచున్నాను. విశదముగ విశేషములన్నియు నీమాఱు వినిపించెద"

చతుర్థనుం డధిక సంతోషంబున నానాలోకాంతరస్థంబులగు కల్పవృక్షకామధేను చింతామణులను, గరుడగంధర్వకిన్నరకింపురుషయక్షరాక్షసదిక్పాలక బ్రహ్మలను, జనార్దన శేషభూషణులను దర్శించి కృతార్థుండ నైతినని తలంచునంతలో నావారువం బాతని కుండినగరంబుఁ జేర్చె.

అప్పు డన్నరనాయకాగ్రణి యనురాగంబున హయపుంగవుం దువ్వి మెడపైఁ జేయిచఱచి క్రిందికిందిగి లోని కేగె. స్వామిని, తేజరింగాంచి మంత్రులు సంభ్రమంబడి మ్రొక్కిరి.

మంత్రులు—దేవా! నీయునికిలేమిచే రాష్ట్రము చిన్నబోయియున్నది. పతిలేని సతివోలె నమంగళమై యుండె.

మ॥ అవరోధాంబుజపత్రలోచనలు దేవా నీ
వియోగంబుచే
నవరోధంబునఁ బొందివాడిన శరీరాంగంబులన్
భూషణా
దివిశేషంబుల నుజ్జగించి సలిలార్ద్రీభూత
నేత్రాబ్జలై
దివసంబెన్న మహాయుగంబులుగ నార్తింజెంది
రత్యంతమున్.

భూపాలకా! మహాభాగ్యమువలన నీవు తిరుగజన్మించితివి. శుభావహంబుగ రాజ్యముయథావిధిగ నేలుము. వీరిట్లుప్రసంగవశంబున నుండునెడ నిలిచియున్న హయంబు నీరజాక్షియై మెఱసె.

రాజు—భామా! నీ వెవ్వరిదానవు? తురంగమ వెట్లయితివి? క్రమ్మఱనిట్టిరూపం బెట్లు పడయం గలిగితివి? నీ వేదేశపుదానవు? నీ నామం బెద్ది? యథార్థము నుడువుము.

అంత నారంభయు నిజవృత్తాంతం బంతయుఁ దేటపడం దెల్పి నీమూలంబున శాపవిమోచనం బయ్యెఁ గానఁ బ్రత్యుపకృతిగ సకల జన వశీకరణంబును, సర్వ దేవతాకర్షకంబును, నిఖిల జగన్మోహనంబును, నిత్యలక్ష్మీకరంబును, మోక్షప్రదంబు నగు నారాయణమంత్రరాజం బుపదేశించెద నని యాప్రకారమొనర్చి దేవలోకంబున కేఁగె.

నారదాగమనము.

కొంతకాలము గడచినపిమ్మటఁ జతుర్ధనుఁడు నిజహర్మ్యాగ్రంబున సమాత్యులంగూడి నానాలోక విశేషంబుల వినోదార్థము ముచ్చటించుకొనుచుండె. జటాధారియుఁ గృష్ణాజినధరుఁడును, నోట నువ్వగించ నాననివాఁడును, సంతతకలహప్రియుండును నగు బ్రహ్మమానసపుత్రుఁడైన నారదుం డందుం జేరె. అవ్విధంబున శ్రీరుక్మిణీ మనోహరుఁ బ్రస్తుతించుచు బ్రవేశించిన సకల విద్యావిశారదుం డగు నారదునిఁ బ్రత్యుత్థానంబుఁ జేసి పూజించి యుర్హాసనంబున నాసీనునొనర్చి కృతాంజలియై చతుర్ధనుం డిట్లనియె.

ధనదాగమనంబువలన నేఁ బావనుండ నైతిని. తమ వాక్యానుసారముగ నా హృదయము నన్ను సురక్షితంబుగ నిల్లు సేర్చె.

నారదుఁడు—రాజా! నీకు క్షేమమా? ప్రజలు సౌఖ్యముగనున్నారా? ధనధాన్య సమృద్ధిగల్గి యెద్దానఁ గొఱంత లేక జనులు సుఖులే?

రాజు—తమబోఁటి పెద్దల యాశీర్వచనముచే నే కొఱంతలేక మనుచున్నాము. అయినను లోకంబులున్న సవరించుకొనుటకు సుపరిపాలనా విధానంబును గూర్చి యించుక వివరింప వ్యవధియున్న నట్లొర్పం బ్రార్థితులు.

నారదుండు—ధరణీపాలా! పతివ్రతా శిరోమణి పతి భావం బెఱింగి మనసునొవ్వఁ జేయక యనుకూలయై యెట్లు వర్తించునో తద్విధముగనే ప్రభువును ప్రజల బాగోగులు తన విగనే భావించి పాలించుట యుత్తమ రాజధర్మము. ప్రజల బాధింపక కుసుమమునుండి పూఁదేనెం గొను తేఁటిరీతి రాజకార్యంబులు నిర్వర్తింపవలయు. హితాహితములారయఁ గలవాఁడును, దూరదృష్టి గలవాఁడును, నీతి కోవిదుండును, వితరణశాలియునైన ప్రతిభాన్వితునే ప్రధానునిగ నుంచుకొనవలయు. ఈభూమియే శరీరమనియు, ప్రజలే యంగములనియు నరపతిజీవుఁడనియు, మంత్రులు ప్రధానాంగము లగు నేత్రద్వయంబనియు ననఁదగు. అట్టిమంత్రు లసమర్థులైనచో రాజు గ్రుడ్డివాఁడనందగు. శౌర్యధనులను, ధీమంతులను, విశ్వాసపాత్రులను, సుహృద్వరులను, నరనాథుఁడు కనిపెట్టియుండవల

యు. భావశుద్ధిగల్గి ప్రజలరక్షించు విభుఁడు ప్రజల సంపద్యుఁక్తుఁడై నిజకీర్తిప్రతాపంబులు దిశలునిండఁ బూజనీయుండగు. రాజా! నీతో నిట్లింతవఱకును ధైర్యము వహించి పలుకుచుంటినిగాని కార్యాతురుండనై సత్వరముగ నేగవలసిన వాఁడనగుట నాగమనవిశేషంబు నెఱుకపఱచి పోవలయు. దుఃఖవార్త నీకెట్లు తెలుపుటయా యని చాలఁగ సందేహించుచున్నాను. నీకుతటస్థించిన యాపదవిధంబుఁ దెల్పిన నీవుమూర్ఛిల్లుట నిక్కువము. ఇందుఁగలవారి నెల్లర నవలికనుపుము. నీకా రహస్యముఁ దెల్పి యేగెద.

ముని యాజ్ఞానుసార మొనర్చినపిదప సంయమివరుం డమ్మహీపతితో నిట్లనియె.

అనఘా! నీ వట్లా నాఁడా మాయాతురంగము నెక్కి యుపరిలోకంబుల సంచరించి వచ్చునెడ యమునానదీతీరంబునఁ దర్పణంబువిడుచుచున్న శ్రీకృష్ణభగవానుని దోసిట నీ హాయముఖంబునందలి ఫేనముపడియె.

మ॥ అది వీక్షించి బలానుజుండు పటురోషా
యత్తుఁడై యుగ్రతం
బెదవల్లాడఁగఁ గన్నుదోయి యరుణస్ఫీతా
కృతిఁ మీఱ ను
న్మదుఁడై యెవ్వని ఘోటకాననజ ఫేనం
బీగతిఁ వచ్చువా
ని దివ్యాకస్పృతిగాచినం దునుముదు న్నేమూన
మాత్రంబునన్!

గీ॥ అని ప్రతిజ్ఞఁజేసి యనుపమసంతోష
భరితుఁడగుచు నాత్మపురికి నేగి
యున్నవాఁడు భుజము లున్నతాకృతిఁబొంద
ననఘ దేహరక్ష యరసికొనుము॥
అని చెప్పి యాతఁడు యథేచ్ఛఁజనియె.

—* చతుర్థుని యుత్తర కార్య నిర్వాహణము *—

ములుకులవంటి పలుకులా నారదుండు వినిపించిపోవుటచే నమ్మకుండు ప్రతిజ్ఞాప్రకారంబును ప్రతిఘటించుటెట్టులా యని భయాక్రాంతుఁడై చతుర్థనభూపాలకుండీరీతిఁ జింతింపఁదొడంగె.

ఉ॥ ఏటికి వేఁటఁబోతి నట నేటికి మాయపుఁదేఁజిఁ గంటి నే
నేటికి దానిఁబట్టితిని నేటికి నెక్కితి నిత్తెఱంగు నా
కేటికివచ్చె నివ్విధికి నవ్వనిపాదము పట్టికొందు నీ
వేఁటయు నన్నుఁ బాండుపృథివీపతిభంగిఁ గలంచె
దైవమా!

అనుచు మానసంబునఁ బ్రాణంబుపైఁ దీపిచేఁ గొండొకతఱి చింతించి మగుడ ధైర్యంబువహించి కులధర్మంబును బాటింపకుంటిగాఁ యని .వగచి సరివారిలో నగుఁబాటు కార్యమొనరించుచుంటిఁగా యని తలవంచి తన్నుఁదా దూఱుకొని రోషముఁబూని గుణహీనుఁడును గుణశూన్యుండు నగు గోపాలుఁడు నాకొక లెక్కయా? రంభాదత్తవరంబుచే దేవతలనాకర్షించియుండటి కార్యం బాలోచింపఁదలంచె. అంతనాతఁడు మంత్రానుష్ఠానంబు శుచియై విధ్యుక్తప్రకారంబొనర్చి తొల్తఁ దైలో

శ్యాధీశుండగు జంభారాతి నాకర్షించె. దేదీప్యమానమగు వజ్రకాంతులవెదఁజల్లు దివ్యమాణిక్యభూషణంబుల ధరించి వేయికన్నుల ఱేఁడు ప్రత్యక్షంబయ్యె. అట్లావిర్భవించిన దేవతాసార్వభౌమునింగాంచి మనంబున ఘనంబుగ సంతోషించి సాష్టాంగ దండప్రణామంబు లొనర్చె.

ఇంద్రుఁడు—రాజేంద్రా! నన్నుఁ బిలిపించిన కారణం బేమి? నావలన నీకొనఁగూడనున్న కార్యం బెట్టిది? ఏటికి ఖిన్నవదనుండవై యున్నావు?

చతుర్ధనుఁడాతని వచనంబులాలకించి కంసారాతి, నిష్కారణంబుగ వధింపఁబంతగించు టెఱింగించి కరుణవహించి తన్నుఁగాఁపాడ నభయ మొసంగు మనియె.

ఇంద్రుఁడు—భూవరా! త్రిమూర్తులచే వరంబులందితిమిగా యను కండకావరంబునఁ జండశాసనులై లోకంబులఁ గాసిల్లఁజేయు దైత్యనికాయంబుల నెల్లఁ దృటిలోఁ బరాహతిచేఁ దుదముట్టించిన శ్రీకృష్ణుని యెదుర్కొనుట యేటిమాట? మానవేంద్రా! ఆమహాత్మునితో నాకు సమరంబు సంభవించి నేనోటువడిన విధానము వివరించెద వినుము. బదరికాశ్రమవాసులగు భరద్వాజ, కణ్వ, కశ్యప, వసిష్ఠ, వామదేవాది మునీంద్రుల యిష్టసిద్ధికై క్రూరుండగు నరకాసురుని వధార్థంబుగ సత్యభామాయుతుఁడై శ్రీహరి ప్రాగ్జ్యోతిష పురంబుఁ జేరె. ఆజి నాసురవైరి శిర ముద్దండ చక్రంబున ఖండించె. అంత నా మురహరుండు మద్గృహంబున మూఁడు దినంబులు నానన్మాన ములందుచు నిలిచె. ఆసమయంబున నాకాంతకుఁ బృందార

కుం డొకండు నందనవనమందలి పారిజాత కుసుమంబు నొక దానినందఁజేసె. పులోమజ శ్రీకృష్ణ ప్రభావం బెఱుంగని దాట నాకుసుమంబు మనుజకామినుల కియ్యఁదగినది కాదు, దేవతా భోగ్యవస్తువనుచు హరిప్రియకొసంగక తానే ధరించె. దీనసత్యభామ సక్రోధయై యానునుబూని భర్తకె ఱింగింప వనితామణి చిత్తంబునంగల యుత్తలపాటు మాన్ప నాహరి నందనవనంబునుండి యావృక్షంబునే పెకలించి విహగాధిపుపైనిడి భార్యాసమేతుఁడై చనుచుండె. అట్లు పారిజాతంబు నపహరించుకొని చనుచున్న యాతనిపై నేమును నావారును నానాస్త్ర సంతానంబుల వదలితిమి. వానిని వేనిని లెక్కింపక దివ్యశంఖారవంబొనర్చె. ఇట్లొనర్ప మావారిలోఁ బెక్కురు భయవిహ్వలులైరి. నాబాణతతులన్నియు వ్యర్థంబులయ్యె. కావున నేను నిన్నురక్షింప నశక్తుండ. పోయివచ్చెద. ప్రథమప్రయత్నమే నిష్ఫలంబయ్యెఁగా యని వేఁడినిట్టూర్పులడరించి ధైర్యమును జిక్కఁబట్టి శంకరుఁడలంచె. పొడసూపిన శూలపాణికి మ్రొక్కి కారణంబునుఁదెల్పి రక్షింపఁబ్రార్థించె.

శంకరుఁడు—క్షోణీశ్వరా! నీప్రాణంబులు నేఁగావనోప. మద్భక్తుఁడగు బాణాసురుని శ్రీకృష్ణునిబారినుండి తప్పింపఁ బ్రయత్నించిన సందర్భమున హరిఘటిమంగాంచితి.

చతుర్ధనుఁడు—దేవా! ఆ వసుదేవనందనునితోఁడి కయ్యం బేకతమునఁ దమకుఁగల్గె?

శంకరుఁడు—బాణునకు నుషయను సుతయుండె. ఆపె నిద్దురయందొక మన్మథాకారుంగాంచి వలచి యాతనికై విల

పించుచుండె. నేర్పరియగు యాపె చెలికత్తె చిత్రరేఖ తన చిత్రలేఖనాసామర్థ్యంబునుం బ్రకటించుచు ముల్లోకంబులయందు సౌందర్యంబునం బెంపొందిన రాకుమారుల చిత్రపటంబులం జిత్రించుకొని తెచ్చి ముందిడి మనోనాయకుని గుఱుతింపవేఁడె. ఆపె యితండే నాపతియని యాశ్రీకృష్ణ పౌత్రుఁడును బ్రద్యుమ్నపుత్రుఁడును నగు ననిరుద్ధుని రూపపటమెత్తిచూపె. చూపి యాపెను మనోవేగంబున ద్వారకాపురంబునకరిగి మాయాబలంబున నాతఁడు మేలుకాంచకమున్న యాతనిఁదన కడకుఁ జేర్చి పుణ్యంబుఁ గట్టుకొనం బ్రార్థించె. ఆపెయు నాప్రకారంబొనర్చె. ఈ దంపతులిరువురు నత్యంతసంతోషంబున రహస్యంబుగ నిట్లు ప్రవర్తించుటచే నుషాకన్యకావ్రాత్యంబునకు భంగంబు సంఘటించినట్లు కొంత కాలంబునకుఁ జెలులనుమానించి బాణున కీవార్త చెవిని వేసిరి. రోషకలితమనస్కుండై యారాక్షసేశ్వరుఁడు యంతఃపురంబుఁ జేరి యట ననిరుద్ధుం గాంచె. వారిరువురును విచ్చలవిడిఁ బెచ్చుపెరుగు మత్సరంబునం బోరుచుండిరి. ఈ వృత్తాంతమంతయు నారదునిచే విష్ణుం డెఱింగి ననసహోదరుండై సైన్యావళితోఁ బౌత్రునికి బాసటగ వచ్చె. దైత్యనాథుఁడు సన్నాగిఁ జేసి సన్నిలిచిన నాగణముతో సేనునుం జేరెతి.

క॥ హరిబలముచేత బలమున్
హరిచే మద్బాహుసత్వమడఁగియు బాణా
సురుఁడు గడుభక్తుఁడగుటన్
బోరిఁ బోరిఁ బోరితిమి కోపమున మనుజేంద్రా॥

ఆభీమసంగ్రామంబున సాక్షాద్విష్ణుండగు కృష్ణుండు బాణుని సహస్రకరంబులు విచిత్రగతి జక్రధారచే మొదలంట నఱికె. తుదకు మత్ప్రార్థంబు బాణునకు రెండుకరంబు లిప్పించితి. ఉషానమేతుండగు ననిరుద్ధుం దోడ్కొనికృష్ణుండు ద్వారకకుం జేరె. కావునఁ గృష్ణునివలన నిన్ను రక్షింపరాదు. అంతఁ జతుర్ధనుడింకఁ జేయునదెద్దియో ? యని యత్యంత భయంబున క్షోభిల్లి యాహార నిద్రావిహార సౌఖ్యంబులమాని కొండొకసేపు చింతించి కమలగర్భు నారాధించెను.

ప్రత్యక్షంబైన వేలుపుపెద్దం గనుంగొని రాజు ప్రణామం బాచరించి దోసిలియొగ్గి యిట్లనివిన్నవించె.

జలరుహగర్భా ! అకారణవైరమూని మురశాసనుండు నన్నునుమ నున్నాడు. నీచరణపద్మంబుల కిదే శరణుఁజొచ్చుచున్నాఁడ. అభయంబిచ్చి రక్షింపంగదే.

వాణీవల్లభుఁడు—క్షోణీవల్లభా ! కృష్ణుని సామాన్య మానవునిఁగా దలఁచితివి కాఁబోలు. పురిటింటనే పూతనం బట్టిమార్చె. పసితనంబుననే శకటాసురునిఁగూల్చె. ఏడాదిప్రాయంబువాఁడై యున్నయపుడే తృణావర్తుని పీచమడఁచె. ఇట్టి యద్భుతకార్యంబు లెన్నియో యాతండొనర్చె. తుదకు నాకుఁ గూడ నాతనిమూలమున భంగపాటు తటస్థించె. అయ్యది యాకర్ణింపుము. కృష్ణుండు గోపనందనులతోఁగూడి బృందావనంబున నొకనాఁడు క్రేపులమేపుచుండె. గోవులుమేయుచుండఁ గృష్ణుండు గోపకులతోఁ జల్దులారగించుచుండె. ఆతని మహిమ నెఱుంగఁదలంచి గోవులను గోపాలురను మాయం

బొనర్చితి. శ్రీకృష్ణ పరమాత్మ దివ్యదృష్టిచే సర్వము నెఱింగి తానే గోరూపములను గోపాలురరూపంబులను దాల్చియా మోసమెవ్వరికిఁ దెలియనీయక మెలఁగె. ఒకవత్సరమైన పిదప నేనందుఁ జేరఁ జతుర్భుజాకృతితో నాకుఁదోఁచె. అప్పుడు నే నాతని చరణంబులకెఱఁగి నేదొంగిలిన బాలకులను వత్సంబుల నర్పించితి. కావున నేను నిన్నుఁగావఁ జాలను. నేనేఁగువాఁడ.

తదనంతరం బా చతుర్థనుఁ డాత్మరక్షణోపాయంబు లన్నియు వృథయగుటచే నేమియుఁదోఁచక నున్మత్తునిరీతి విలపించుచుండె. రాజ్యపాలనము మాటయే యెంచక మైమఱచియుండె. ఇతరులతోఁ బల్కనొల్లఁడు. పెద్దలఁ గౌరవింపఁ బోఁడు. ఆయుర్దాయము క్షీణించిపోవుచున్నదిగా యని లెక్కించుకొనును. తనవారిని వీడిపోవలసివచ్చెఁగా యని వందురును. రక్షించువారు కఱవైరిగా యని కుందును. ఇంతబలముండియు నేను బలవంతుఁడ నయ్యు నాప్రాణసంరక్షణ మొనర్చుకొనలేని వృద్ధుఁడ నైతినిగా యని పలుమాఱు పరితాప మొందును. బ్రహ్మకులే పరిభవింపబడినప్పుడు నేనెంతవాఁడనను కొనును. అంతలో ధైర్యమూని శౌర్యము మెఱయ సంగరరంగంబున నాతని నెదిర్చి కత్తికోలఁదిపోరద. చంపినఁ జంపెను లేక చచ్చినఁజచ్చెద. ఇదియె నానిశ్చితాభిప్రాయ మనుకొనును.

ఇట్లు బహుప్రకారంబులఁ బరితాపఁ మొందుచున్న భూధవుని మ్రోల కొకభిల్లుఁ డరుదెంచి మ్రొక్కి యిట్లనియె.

రాజా! మనపరిసరారణ్యభూముల కర్జునుఁడు ససైన్యుండై యరుదెంచి విడిసియున్నాఁడు.

చతుర్థనుఁడు—ఈనరునకును నా నారాయణునకును భేదము లేదండ్రు. హరివంపున నీతఁడు నన్నుబట్టికొనిపోవవచ్చునేమో. ఏమైననుకానిమ్ము. రానున్నది రాకమానదు. మున్ముందు నేనాతనిపాలికేగి పాదములపైఁబడి కావవలయును; కాచెదనని యభయము నొసఁగినఁగాని పాదములవిడి లేవ ననెద.

ఇట్లు నిశ్చయించుకొని యాప్రదేశమునుండి నిర్గమించెను.

—* చతుర్థనుఁడు కిరీటికిఁ బాదాక్రాంతుఁడగుట *—

అట్లు కొంతతడవు మనంబున వితర్కించుకొనినపిదపఁ జతుర్థనుఁడు పాండవమధ్యము దర్శింపనేగఁ గృతనిశ్చయుండై కానుకలంగొని యాతనిసమీపించి వానినర్పించి సాగిలబడి మ్రొక్కి లేచి నిలిచి సవినయంబుగ ముకుళితహస్తుండై యాతనితో నిట్లని విన్నవించుకొనియె.

స్వామీ! బలవంతుఁడొకఁడు నన్నుఁబట్టి పల్లార్చుటకు శపథమూనియున్నాఁడు. ఆపచ్ఛరణ్యుండ వీవని నిన్వెదకికొనుచు వచ్చినాఁడను. అభయమొసఁగి ప్రోవవలయును.

ఇట్లనుచు నాతని పాదసరసీరుహంబులపైఁబడి లేవకుండె.

అర్జునుఁడు—రాజా! భయంబు నుడుగుము. నీప్రాణంబునకు నాప్రాణమడ్డము. శ్రీకృష్ణపరమాత్మ పాదములపై నానసుమీ! నిన్నుదప్పక రక్షింతు లేలెమ్ము. అట్లుకావఁజాలనినాఁడు మత్కృపాణమున నాశిరమును ద్రుంచుకొందు.

రాజా! నీకువైరియెవ్వఁడు? వైరకారణమెద్ది? ఉదంతమంతయు సవిస్తరముగ వివరింపుము.

ఈప్రశ్నతో నాతనిగుండె జల్లుమని యథార్థమెఱింగించిన పైమూడనున్న కీడెద్దియో యని సందేహించుచు భీతిచే నాపాదమస్తకము గడగడవడంక మోహమున వెల్లఁదనమూని మాటతడఁబడ నిజచరిత్రము చెప్పఁగడఁగె.

దురంత చింతాక్రాంతస్వాంతుఁడై యజ్జననాథుఁడు కమలోద్భవాదులు సహాయ మొనరింప నిరసించిన వారను పల్కులు లోనుగాఁగల స్వీయచరిత్రంబుఁ దెల్పిన

ఉ. ఆ నరనాథువాక్యము భయంకరమై తనవీనులందు ను
గ్రానలకీలసోఁకిన క్రియం బరితాపము నొందఁజేయఁ గ
న్గానల నశ్రులుప్పతిల గుండెలుజల్లన వెచ్చనూర్పుచు
న్మానసవీథిఁ జింతిలుచు మాన్పడి యుండెనగుండు దుఃఖమై.

హా! నే నేటి క్రొత్తదేశముఁ జేరితి? కారణమారయక నే నేటి కథయు మొనఁగితి? హా! మాధవా! నన్ను మోసగించితివిగదా. కార్యార్థివై మున్ముందుగ వైరి శ్రీకృష్ణభగవానుఁడని తెల్పిన రక్షింపనని యుపాయము పన్నితివి. మా ముఖ్యప్రాణమును మాకులదైవమును మా దేశికుండును మాకత్యంత మిత్రుండును మా కేడుగడయునగు కృష్ణుండా నీకు వైరి!.

తే. అట్టి పరమాత్ముతోడ నే ననిమొనర్పు
టెట్లు దేహంబుతోడఁ జరించు టెట్టు
లీధరాధవుఁ గాపాడు టెట్లు దీని
కేమి చేయుదు నిందఱకేది గతియొ!

ముకుందుని ప్రతాపము సమగ్రంబున నెఱింగియు నే నేమని యాతని ప్రోల భండనంబున నెదిరి నిలువఁగల సా

మర్త్యధర్మముగలవాఁడ? నోరుజాతి యుభయముసంగతినంటినే! ఈతని రక్షించుటెట్లు? ధీరుల కాడినమాట దప్పుటపాడి కాదు. తలనొడ్డియైనను తనతలఁపు నెగ్గించుకొనుట యుత్తమరాజధర్మము.

క. శరణాగతుఁడగు వానిఁ
గరుణం దనువైన నిచ్చి కావఁగఁ దగు భూ
వరునకుఁ బక్షికినై తన
శరీరమాంసంబు శిబియొసంగఁడె కరుణన్.

జీమూతవాహనుండు సర్పంబునకై విహంగోత్తమునకు ప్రాణంబులనీఁడె?

క. కావున శరణాగతునిన్
భూవరుఁ గాచెదను నేను భూమిన్ హానిచేఁ
జావైన లెస్సయుటుగా
దా విజయంబైన మిగుల ధన్యతగాదే.

అనఘా! నీవు నిజపురంబునకేగి సైన్యసమేతుఁడవై యింద్రప్రస్థంబునకు రమ్ము.

—* చతుర్థనుఁ డింద్రప్రస్థంబునకుఁ జేరుట *—

ఇంద్రప్రస్థంబున నొక్కనాఁడు ధర్మసూతి సోదరులు గొల్వ నిండుకొల్వున నున్న యెడఁ జతుర్థనుఁడందుఁ జేరి యుపాయనంబుగఁ గొనితెచ్చిన యేనుఁగులను, గుఱ్ఱములను, సువర్ణ రాసులను సమర్పించె.

ధర్మరాజు వానినందుకొని యాతని నర్హాసనంబున నాసీనుఁ జేసి తగుమర్యాదలం జరిపి యాతం డే పురాధీశుఁడని యర్జునునకుఁగనుసన్న యొనర్చె.

అర్జునుఁడు—అన్నయ్యా! ఈతఁడు కుండినపురాధీశుఁడు. చతుర్ధననాముఁడు. ఆనాఁడు నేను వేఁటాడ నేగి యాతని పురసామీప్యంబున నున్న వనంబున మృగావళిం జక్కాడి విశ్రమించియుండు నెడఁ గలనిజంబు మఱుఁగుపఱచి విరోధిబారినుండి నను దప్పించి, రక్షింపుము. శరణుశరణు ఆపద్బాంధవా! యనుచుఁ బాదంబులపైఁబడియె. శరణనిన వానిఁగాచుట విధి యని యభయ మొసంగి విరోధియెవ్వరంటిని. దానికాతఁ...

ధర్మరాజు—తమ్ముఁడా! ఏటికి సందేహించెదవు? దగ్గుత్తికపడి మాటరాక కంట నీరిడుచుండుటకుఁ గారణమేమి? వైరియెవ్వరనియె? తెల్పుము. కీర్తికాములమగు మనకు శరణాగతునిఁ గాచుటకన్న దొడ్డకార్యమెద్ది? నీప్రతిజ్ఞయే నాప్రతిజ్ఞ. వైరియెట్టివాఁడేనియు జంకక శక్తికొలఁది యెదిరించి మన బొందిని ప్రాణములున్నంతవఱకు వీని రక్షించియే తీరవలయు. చతుర్ధనభూపాలా! నీవు నిర్భయముగనుండుము. నీవైరియెవ్వరో పేర్కొనుము.

చతుర్ధనుఁడు—అనఘాత్మా! నమస్కారము. ప్రాణంబులపైఁ దీపిచేఁ గపటమతిని యాచించినమాట వాస్తవము. భీరుఁడను నాయెడఁ గరుణాంతరంగులై ప్రోవ సమకట్టినందులకు వందన సహస్రంబులివే యర్పించుచున్నాను. నన్వధింపఁ దలపెట్టిన మహామహుఁడు శ్రీకృష్ణ పరమాత్ముఁడు.

అట్లు చతుర్ధనుఁడు తన చరిత్రనంతయు విపులముగ నయ్యజాతశత్రునకుఁ దేటపఱచె.

—* కరినగర ప్రయాణము *—

ధర్మరాజు నిజాభ్యంతర మందిరంబునకు సోదరులు తోడరా నేగ, ద్రౌపదికిని, కుంతికిని, శ్రీకృష్ణునితోఁ దటస్థించిన కయ్యంపుఁ దెఱం గెఱింగించె. కలనేని తలంపని విధానము తటస్థించినందుల కందఱును మనస్సున నొచ్చుకొనిరి. క్షత్రియధర్మంబు నిర్వర్తింపక యాలసించు టన్యాయంబని యెల్లరును నేకాభిప్రాయులై తాతయగు భీష్మునికడ కేగ నిశ్చయించుకొనిరి. మఱునాఁటిదిన ముదయమునసే యుధిష్ఠిరుఁడు సోదరులును జతుర్ధనుఁడును తోడరా నిజబలంబులతోఁ గరిపురంబునకుఁ జేరఁబోయె. హస్తినపురంబున కేగి తాతపాద సన్నిధిం జేరి సాష్టాంగ దండప్రణామాదులొనర్చి యాజ్ఞానుసారంబుగ నర్హాసనంబున నాసీనుండయ్యె.

భీష్ముఁడు—నాయనా! ధర్మజా! నీవు తమ్ములంగూడి హుటాహుటి నిటకు రాఁగారణం బేమి కల్గె? అనూతన పురుషుం డెవ్వఁడు?

ధర్మరాజు—పితామహా! ఈతఁడు కుండిన పురాధీశుఁడు. చతుర్ధనుఁడను నామంబునం బరఁగువాఁడు. ఈతఁడొక మాయాతురంగంబు నెక్కి త్రిలోకములును సంచరించి నిజ పురోన్ముఖుండై సనుదేరు నెడ యమునానదీతటంబున నర్ఘ్య మువదలుచున్న శ్రీకృష్ణునిదోసిటఁ దురంగ ఫేనము పడెనఁట. ఆకారణంబున నిట్లొనర్చిన ద్రోహిని మానములోఁ జక్రధాటిచేఁ ద్రుళ్ల సేతునని ప్రతినబూనెనఁట. అర్జునుండు కుండిన పురపరిసరారణ్యములకు మృగయా తత్పరుండై యేగి.

వేఁగిన మనవాని నీతఁడు తొలుదొల్త శత్రువునామం బుచ్చరించక శరణార్థిని రక్షింపవేయుని పదంబులంబట్టి నిలుపనీడనిచ్చెదనన్నఁగాని విడువననియె. అందులకుఁ గిరీటివల్లె యని విడఁ గృష్ణుండే పగవాఁడనియె. మించినదానికి వగచిన లాభమేమని నేను సందుల కియ్యకొంటిని.

భీష్ముఁడు—ఔరా! విధిప్రేరితంబై యెంతటి కార్యము నెట్టుకొనివచ్చెను! ఇయ్యది యొక విషమస్థితియనవొప్పు. కృష్ణునితోడి సమరము సామాన్యమా? అతని బలసత్త్వంబు లమోఘములు; సమరప్రౌఢప్రతాపాదు లనిర్వచనీయంబులు. అంబుజాసనరుద్రాదులే యాతనితో సంగ్రామంబున నిలువఁ జాలరైరి. మనవాన్న నెంతవారము? కట్టడి బ్రహ్మమనపాల నీచతుర్ధను నేలత్రోసె? అబ్బా! పుండరీకాక్షునితోడి పోరాటమా? దైవమా! నీమాయ నేమననొప్పు! శుభాశుభంబులు దైవప్రేరణానుసారంబుగ సంభవించుచుండు. కావునఁ బ్రతిజ్ఞా నిర్వాహణ మవశ్యకర్తవ్యంబు.

అట్లు గంగానందనుని యామోదంబును బడసి ధర్మజాదులు ధృతరాష్ట్రమహీపాలుని సందర్శింపనేఁగిరి. భూపతులును దొరలును మంత్రులును బుధులును గొలుచుచుండ నిండుకొలువున నున్న ధృతరాష్ట్రుని నిరుపమానంతసంతోషభరితస్వాంతుఁడై వెలుఁగుచున్న సుయోధనునిం గాంచ సభామందిరద్వారంబుకడ కెల్లరు నేఁగి దౌవారికునిచేఁ దమరాక ప్రభునకెఱుంగఁజేసిరి. ఆంబికేయుండును వారల సగౌరవంబుగఁ గొలువుకూటంబునకుఁ బిలిపించుకొనియె. అజాతశత్రుం

డును సోదరులును జతుర్థనుండును లోనికేగిరి. ధర్మరాజా దులు చీరుచేసిక్రముక్కి దుర్యోధనాదులఁ గాఁగిలించుకొని యుచితాసనంబుల నాసీనులైరి. అంధనృపతికిఁ బాండవులతో పాటు చతుర్థనుఁడును గులగోత్ర నామంబులఁ బేర్కొనుచు సాష్టాంగ నమస్కారంబులొనర్చె. ధృతరాష్ట్రుండు నృపాలుని సన్మానించి ధర్మపుత్రా! యీ మహారాజెవండు? నీవెంటరాఁ గతమెద్ది? యనియె.

ధర్మరాజట్లు ప్రశ్నించినఁ గురురాజున కా భూపాలుని చరిత్రము సవిస్తరముగఁ దెల్పి యాతని యాగమనంబునకుఁ గల్గిన యావశ్యకత వినిపించె. భూపాలునిఁ బాలింప మిమ్ములఁ గూడ వేఁడ నుద్యుక్తులమై యిటఁ జేరితిమనియె ఆపగానందనుని సన్నిధి కేగి కార్యంబు తెఱంగెఱింగించి యీనృపాలుని రక్షించుట యనివార్యకార్యమని యనుజ్ఞవడసితిమనియె. మీయభిప్రాయంబును వ్యక్తీకరింపఁ బ్రార్థితులనియె.

ధృతరాష్ట్రుఁడు—నీవుతలఁచిన కార్యమెట్లు నెఱవేఱ కుండు ?

శ్రీకృష్ణునితో సంగ్రామమనఁగనే శకుని, కర్ణ, దుర్యోధన, దుశ్శాసనాదులు పరమహర్షంబునొందిరి. పరమ మిత్రులకుఁ బ్రబలవైరము సంఘటించెఁగా యని వీరల కాత్మ యుప్పొంగి పోవుచుండెను.

శకుని—ధర్మతనయా ! ఎప్పటికిని నీవింతియేగదా. నీబలము నీవెఱుఁగలేవు. కృష్ణుని నెదుర్కొని యోడించుట

యొక లెక్కయా? సందేహింపకుము. ఆ యాదవేంద్రుని సామర్థ్యమే నెఱుంగుదును. మనకు మేలు చేకూరుట ధ్రువము.

కర్ణుఁడు—అర్జునునియందుఁ జేరిన యాతనిఁ గృష్ణుఁడొక్కఁడే కాదు! నిర్జరులతోఁ గూడివచ్చినను జంపుటమాట యటుండనిండు. తేఱిపాఱఁజూడఁగలరా?

దుర్యోధనుఁడు—అన్నయ్యా! జయము మనకు సత్యము.

మ॥ వనజాక్షుండననెంత ద్రోణగురుఁ డశ్వత్థామయుం గౌతముం
డును మీరేవురు నేను బాహ్లికుఁడుఁ గర్ణుండున్ మదీయానుజుల్
ఘనులీరాజులు భీమజాద్యసురులున్ గంగాసుతుం డాదిగా
మనసైన్యంబులుగూడి పోల్చిన రణక్ష్మామండలిన్ నిల్చునే॥

కావున నర్జునుని ప్రతిజ్ఞ నిర్విఘ్నంబుగ నీడేఱు.

దుశ్శాసనుఁడు—ఈక్షణముననే మనము భూమిపతులెల్లరకు వారివారి సైన్యములతో బయలుదేఱి రమ్మని శ్రీముఖంబు లంపెదము. వారు చేరినపిదప నెల్లరును గూడి సైన్యరాజితో ద్వారావతిముట్టడించి యాగోపాలునిఁ బాఱఁద్రోలుదము.

ఆ దుష్టచతుష్టయంబుల వీరాలాపంబులాలకించి యుధిష్ఠిరుం డాత్మయందబ్బుర మొంది వారల కిట్లనియె.

మాతులా! కర్ణా! సోదరులారా! సకలరాజన్యులఁ గద లిరా వారలంపుఁడు. ఆపిమ్మట దాడివెడలుటకుమున్ను దూత నొకని శ్రీకృష్ణుని తలఁపుఁదెలియ నాతనికడ కంపుదము. తాతగారిట్లొనయ్యుట ధర్మజుని యాజ్ఞాపించిరి.

ధర్మజుని వాక్యంబుల కెల్లరును వల్లెయనిరి. అంతఁ గొలువుఁజాలించి యెల్లరును నిజనివాసంబులకుఁ జనిరి.

—* ద్వారకయందలి విశేషములు *—

తే॥ గీ॥ పాండవులుఁ గౌరవులు సర్వపార్థివులును
హాస్తిపురమునఁగూడుట యాప్తచరులు
దనకు వినిపింపఁ గృష్ణుఁ డుద్ధవునిఁ బిలువ
నంపి యాతనితోడ నిట్లనుచుఁ బలికె॥

వింటివా యుద్ధవా! యెంతటి విపరీతము సంభవించిన దో! నీరునుఁ దైలమువలెఁ గలియక మెలఁగుచున్న పాండవులును గౌరవులును నీరక్షీరములట్లు గూడుకొని సకలనృపులతో సర్వసన్నద్ధు లగుచున్నారఁట! పోరు నష్టము పొందు లాభమందురు. ఏకారణముననైన వారలకుఁ బొత్తొనఁగూడుటయే మదీప్సితము. పాండవేయులు నన్నాలోచింపక యెయ్యదియు నొనర్పరు. అట్టివారీవిషయమున నన్నేల మున్ముందు చేరరారు? ఇదేమిచిత్రము? ఉపేక్షఁ జేసెడివారు కారు. కార్యము భారమైనది. కాకున్న నృపులనెల్లరఁ గూర్చుట కేమి కారణముండును? ఇట్టి కార్యమెత్తినపుడు నాచెవిని వేయకుండుట

యా? ఇతరు లూరకున్నను నాముద్దుల మఱఁది వన్గానరా కుండుట కేమికారణము? నమ్మలేకున్నాను. నమ్మకుండు టెట్లు?

ఉద్ధవుఁడు — వసుదేవతనయా! నాకును విపరీతముగ నే దోఁచుచున్నది. ఇంనుండియెవ్వరైన నొకరందుల కేగి వచ్చినఁ గాని యీరహస్యం బెఱుకపడదు?

త్రికాలవేదియయ్యు నాకృష్ణభగవానుఁడు రాజధర్మంబు మదినెంచి యక్రూరునిం బిలిపించి యాతనితో నిట్లని యానతిచ్చె. సమస్తధరణీశులతోఁ బాండవులును గౌరవులును వేదండపురమ్మునఁగూడియున్నారఁట. నీవునందుఁ జేరివిషయంబులరసి ధర్మతనయాదులకు మానసేమంబుఁ దెలిపి వారిక్షేమలాభంబులఁ దెలిసికొని రయంబున నిటఁ జేరుము. వల్లెయని యాతండును రథారూఢుండై గజపురమ్మునకుం జనియె. చని యాతండు తత్పురప్రాంగణ ప్రదేశంబుల నిండుకొనియున్న సైన్యంబులం గాంచె. రాజద్వారంబుఁ జేరి దౌవారికులవలన ధృతరాష్ట్రునకుఁ దనరాక నెఱంగించె. లోనికిం బ్రవేశింప నాతఁడనుజ్ఞ నొసఁగినతోడనే సభామంటపంబునకుం బోయి యచ్చట గాంగేయ బాహ్లిక సోమదత్తాదిజ్ఞాతులును, యుధిష్ఠిరాది పాండవేయులును సుయోధనాది కుమారవర్గంబును ద్రుపద శాబలసైంధవాది బంధువులును మత్స్య మద్ర మగధ మాళవ నేపాళచోళ కుంకణ కొంకణ కోసల కుకుర కురుకరూశాది నానాదేశాగతరాజవరులును, విదురసంజయులుం గొలువ నవర్ఘ సింహాసనాసీనుండై పేరోలగంబున్న వైచిత్రవీర్యునకుం బ్రణమిల్లి కౌంతేయగాంధారేయాదుల నాలింగనంబు గావించి

తక్కినవారలచేత సంభావితుండై తనకమర్పఁబడిన కనకపీఠం
బున నాసీనుండయ్యె. కుశలపూర్వకంబుగాఁ దత్తదుచితాలా
పంబులాడుచున్నయెడ నజాతశత్రుఁ డక్రూరునితో నిట్లనియె.

అక్రూరా! నీవుసార్థక నామధేయుఁడవు. క్రూరుఁ
డవు కాకుంటనే నిన్నక్రూరుండన నొప్పు. అనవరతము శ్రీ
రమాను పాదచింతన ధ్యానంబున నప్రమత్తుఁడవై యుండుకతననే
నిన్నక్రూరత వరించె.

మాబావయగు శ్రీహరి కుశలంబున నున్నవాఁడే?
పెదబావయగు బలరాముఁడు సౌఖ్యముననున్నాడే? ముద్దుల
బావమఱఁది సాత్యకియు సోదరులును సుఖులే? సాంబాదులు
ముదంబుననున్నారా? అవరోధజనంబెల్లరును క్షేమమేకదా?
సర్వకాలసర్వావస్థలయందును నీవాతనివిడనాడకుందువుగదా?
శ్రీకృష్ణుండు మమ్మెప్పుడైనఁ దలంచుచుండునా?

అక్రూరుఁడు—యుధిష్ఠిరా! ఎట్టిప్రశ్న వేసితివి?
నన్బరీక్షించుట కిట్లనుచున్నావా? మీకును హరికిని భేద
మున్నదని యెవ్వరనఁగలరు? ప్రేమతో మిమ్మాతఁడనుకొనని
ప్రొద్దుండఁబోదు.

యుధిష్ఠిరుఁడు—మహాత్మా! మీరాయాగమనంబునకుఁ
గారణంబెద్ది?

అక్రూరుఁడు—శమనతనుజా! మీకును ధార్తరాష్ట్రు
లకును వైయ్యము సంభవించిట్లు చారుల మూలమున ముర
హరుండెఱింగి సంతసించె. మించిన వైరము తగదని యుభ
యులును గ్రహించి సన్ధిం జరింప నెంచుట జేమదాయ

కంబని యాతేఁడు మిగులవార్థించె. రాజనివహమ్ములతోడ నిటఁ గూడియుండినట్లు చారులు దెలుపఁ దత్కారణమేదియో యారసి రమ్మని నన్పంపె.

ఈప్రశ్నకు ధర్మసూనియుఁ దక్కినవారలును బదులాడక తడవుసేసిన దుర్యోధనుండిట్లనియె.

ఈచతుర్థనుఁడు హయంబు నెక్కి యాకసంబునఁ జనునెడ వచ్చినమారుతముచే గుఱ్ఱపు నురువు యమునలో నర్ఘ్యమిడుచున్నఁ గృష్ణుని కేల్దోయింబడెనఁట. దానఁ గినిసి మానసములో నీతనిం ద్రుంతునని కృష్ణుండు శపథమూనెనఁట. అంత భయంబున నీతఁడు మాగాండీవి యండం జేరి యభయంబు వేఁడె. గాండీవి కరుణించి కావనెంచె. శరణార్థిని రక్షించుటకు మేమందఱ మిందుఁ జేరితిమి. నెపము లేని ప్రతిజ్ఞ మానుమనుము. ప్రతినవిడిచి యీతనిం గాచుట మంచిదనుము. కాకున్న రణము నిజమనుము. తనబలమును నెఱిఁగి ప్రవర్తింపుమనుము.

శా॥ ద్రోణాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడుఁ గర్ణుండర్జు
నుండున్ జగ
త్ప్రాణాత్మోద్భవధర్మజుల్ [illegible]వలు నాహైడింబుఁడున్
ద్రోణియున్
క్షోణీనాథుఁడుఁ జోరనిల్వఁగ బిడౌజుండోఁ యజుం
డో కదున్
వేణుధ్యానముఁ జేసి గొల్లసతులన్ వేఁగూడుటో
కయ్యముల్।

కావున బహుశాస్త్రజ్ఞుఁడవగు నీవు మాకృష్ణునకు సద్బుద్ధిఁ జెప్పి చతుర్థనునిం జంపెదనన్న ప్రతినమాన్పింపుము.

అక్రూరుఁడు—సుయోధనా! రాజ్యమదంబు కన్నుల గప్ప ముందు వెనుకలఁ గానంచక కోటికివచ్చినట్లు కాఱ్ఱేల ప్రేలెదవు? చక్రపాణి సత్యసంకల్పమును మాన్ప నాబ్రహ్మకైన శక్యమా? సమస్తలోకంబులం దాఁగుమాఁగులో నర్చి దేవతల భోగభాగ్యంబుల చూఱఁగొనిన రాక్షసేశ్వరుల మాటమాత్రమున ద్రొల్లనేసిన వారికిని మాకును హస్తిమశకాంతరము వారగలదన్నమాట మఱచితివే? కాళీయఫణిగర్వమడంచిన ఘనుఁడనియు, సామజశ్రేష్ఠంబగు కువలయాపీడంబుఁ గూల్చిన జెట్టియనియు, బాహుయుద్ధంబునఁ జాణూరునిఁ ద్రుంచిన బలశాలియనియు, జరాసంధునిఁ బదునెనిమిదిమార్లు రణభూమిఁ బాఱఁదోలిన పరాక్రమశాలియనియు, దోశ్శక్తిని బ్రహ్మాండమున నాతనికడ్డువాఁడు లేఁడనియు, శూలపాణియంతటివాఁడు బలిసుతునితోఁ గూడి యాహవంబున నెదుర్కొనఁ జాలఁడయ్యెననియు లోనుగాఁగల హరిపరాక్రమంబులు వినియెఱుఁగవా? బాగుగ మంతనంబొనర్పుఁడు· ఆత్రపడకుఁడు. హరితోఁడి పగ పాముతోఁడిచెలగాటయని నమ్ముఁడు. అతని నెదుర్కొనుటయున గిరితోఁ డీకొట్టుకొనుటయే. కావున మీరెల్లరు నీభూవిభునిం దోడ్కొని శ్రీయఃపతిపాదారవిందంబులపైఁబడి శరణము వేఁడుఁడు. అతఁడు రక్షించును.

దుర్యోధనుఁడు—నాయనా! అక్రూరా! అమ్మపుట్టిల్లు మేనమామదగ్గఱనటోయి పొగడుట? ఔనునిజమే. మగటిమి

యున్న శ్రీకృష్ణునిదే మొగఁటిమి. పాలిచ్చుటకు వచ్చినయబలం గూల్చిన యమోఘబలశాలి. బండిఁ బగులఁదన్నిన బలపరాక్రమశాలి. మద్దిచెట్లం దెగనేసిన మహాబలుఁడు. నీటిపాముం జంపిన నీటుకాఁడు. నాతిసహాయంబున నరకాసురుం గూల్చిన నేర్పరి. జరాసంధుని ధాటికోర్వంజాలక స్వస్థానంబునుండి తోకముడుచుకొని పారిపోయిన పరాక్రమశాలి. నీస్వామిభక్తికి మెచ్చితిని. నిన్నుఁబోలిన బట్రాజులు పైకీర్తినిజాటుచుండుటం బట్టియె కొందఱమాయకులు కృష్ణుఁడన్న నంతవాఁడింతవాఁడని మోసపోవుచున్నారు.

కృష్ణుని సామాన్యమానవునిగ నెంచి పరిహాసించుచున్న రారాజు వాక్యంబుల సరకుసేయక నాతనిఁ దృణీకరించి యక్రూరుఁడు భీష్ముని దిక్కుఁ జూచి యిట్లనియె.

మహాత్మా! ఈతఁడు మదోన్మత్తుఁడై కృష్ణుపరాక్రమం బెఱుఁగక తూలనాడుచున్నాఁడు. అవీరాగ్రేసరు ప్రభావంబు తమకు దెల్లంబు. ఉగ్రుండై యానందనందనుం డొక్కమాఱు రణభూమిం దేఱిపాఱఁజూచిన నిలువనోపఁగలవారెవ్వరు? కావున నాతనితో వైరముడిగి శరణు చొరుట శ్రేయము.

అక్రూరుఁడు భీష్ముఁడు తనపల్కులకు నిరుత్తరుండై మిన్నకుండుటం గాంచి ధర్మరాజాదుల నుపలక్షించి యిట్లనియె.

పాండుకుమారులారా!

క॥ హరిమీకుఁ బ్రాణబంధువు
గురువుఁ సచివుండు రక్షకుఁడునై మిమ్మే

పురఁ గూర్మినెల్లవేళల
నరయుచు రక్షించినందుకా యిదిదలఁపఁగ!

అట్టి శ్రీకృష్ణునిపొందు మంచిదో ధార్తరాష్ట్రుల పొత్తు మంచిదో యోచించుకొనుఁడు. వీరు మీకు నిమిత్తమాత్ర మిత్రులు, సహజవైరులు. ఎట్లయినమీకును యదునందనునకును మిత్రభేదముఁ గల్పించుటకే వీరి కీయవ్యాజప్రేమము. మురళీధరుని దయకు మీరు దూరులుగాఁగనే మిమ్ముం దునిమి మీ రాజ్యమపహరించుటయే వీరినిశ్చితాభిప్రాయము. ఈనృపకీటకంబుం జేపట్టి దేవకీనందనునితోఁ గయ్యంబునకు దిగుట కర్జంబుగాదు. పార్థా! నాపలుకులాలకింపుము. మఱిదివను చనువుమానుము. వంతగించి మేనమామనే సంహరించిన యాతనికి నితరులెంతటివారు. వానికి శరణుఁ జొచ్చుటే భావ్యము.

అర్జునుఁడు—అక్రూరా! గ్రహించినవాని త్యజించు టెట్లు? న్యాయవిరుద్ధంబుగదా. సర్వభూతాంతర్యామియగు పరంధాముఁడేమిచేసినం జేయునిమ్ము.

అంతట యుధిష్ఠిరాదులు రమావల్లభునకుఁ దెల్పుమని యక్రూరునితో వేఱువేఱుగఁ దమపల్కులవినిపించి తమరును నొకబుద్ధిమంతుని నాతనిపాదసన్నిధికిఁ బంపి యొనర్పనున్న విధ్యుక్తధర్మంబుల తెఱంగెఱింగించెదమని సవినయంబుగ విన్నవించి పనిపిరి. అక్రూరుండును రథారోహణంబుఁ జేసి రయంబున ద్వారకాపురంబుఁ జేరి మురమథనుని పాదసరసీరుహంబులకు మ్రొక్కి యనుమతిని నర్హాసనంబున నాసీనుండై

సోదరులును నందనులునుఁ గొల్వనున్న మురాంతకునకుం గరిపురంబునందలి యాంబికేయు పేరోలగంబునందలి విశేషంబుల వినిపింప మొదలిడెను. కమలదళాక్షుఁడు దుర్యోధనుని ననుదిత వీరాలాపంబులకుఁ జిఱునవ్వునవ్వి పైవిశేషంబులం దెల్పుమనియె.

అక్రూరుఁడు॥ పద్మదళాక్షా! నేనరుదెంచునపుడు ధర్మజాదులు తమతో విన్నవింపుమనిన వార్తలాలకింపుఁడు. ధర్మజుండిట్లనియె.

“తేఁను కపటమున మా తుజ్జునునిఁ జేర. అభయమొసంగినవాని విడనాకుట ధర్మవిరుద్ధముకదా మఱేది శుభ్రతరకీర్తి దశదిశలనింపినవాడవునీవు. అట్టివాఁడు శరణార్థినిఁ ద్రోసిపుచ్చునను నకఖ్యాతికి నెడమిచ్చుటకు నీవు మాత్రమియ్యగింతువా? ఏకశరీరులై మెలఁగిన మీ యిరువురకును నొక నృపుని రక్షించునెడ భేదాభిప్రాయము శేర్పడినంగరంబునకు గడంగితిరనిన లోకులు నవ్వరా! మేనత్త మేనమామ బిడ్డలమనుమాట మఱవకుము. మీపాదభక్తులయెడ నెనరుఁ జూపుఁడో హా. ప్రతిన నుపసంహరించుకొని భూధవునిఁగావుము మఱిది మాటఁ జెల్లింపుము.

భీముఁడిట్లనియె “మాయన్నగారి మెత్తని మాటలన మేము భయమున గజగజ వడఁకితి మనుకొనకుము. బంధుత్వంబున కెడబాటుగల్గునను సముద్దేశమున నట్లనెనని నమ్ముము. అర్జునుఁడు గాచుచున్న మనుజాధిపుని బ్రహ్మరుద్రులతో నేకమైవచ్చినను ద్రుంచు టశక్యము. కావునఁ గుండినపతిం

గాచుట యుభయులకు జయంబు. లేకున్న నాలావును నర్జునుని పరాక్రమంబును జ్ఞప్తికి దెచ్చుకొనుము"

అర్జునుండిట్లనియె. "పిల్లికిం బెంచిన బెబ్బులియయ్యె నను గొనుము. నావృద్ధికి నీవేమూలకారణుండవు. మంచియో చెడ్డయో పుడమిఁజేసినింగాచెదనంటి. నా మేనం బ్రాణంబు లుండునంతవరకు నాతనింగాచుట నావిధి"

బలరాముఁడు—ఏమి కృష్ణా! మాటాడకున్నావు? అక్రూరునిపల్కులు వ్యర్థములేమోయని యనుమానపడుచున్న ట్లున్నావు. కాకున్న నీవు నీవారని హెచ్చుగనమ్మిన పాండవే యులపల్కు లిట్లుండునను! కావంతేని యుపకారియుండునా! అందుఁబాండవమధ్యమునందు నీమాట కెదురాడునా? ఇదేటి మాట! అక్రూరా! అసందర్భంబులాడుచున్నావు. నిదురయం దున్నావా? కలవరింతమాటలుకావుకదా? కిరీటికీర్తి గాపాడుటే నీకుబరమధర్మము. ఆతని బ్రతిష్ఠగాపాడుటకై స్త్రీప్రతినవిసర్జిం చుకొనుటయొప్పు. గౌరవార్హులకు గౌరవహాని సేకూర్పనెంచుట కుసంసిద్ధుడవైనందులకుఁ గృష్ణా నీవునిశ్చయముగ శిక్షార్హుం డవు. వారామాట ననకమున్న కుండినందులకువగచుచున్నాను. కృష్ణా! మునిఁగినదేమి? వారిదూతరానేల? వారికిఁ బ్రయాస గల్గింపనేల? నీవేమువ్వుందుగ నేఁగి యాపదలు మూడినపుడు మీరందఱేకమగుదురో కారో పరీక్షించుటకిట్లొనర్చితివని ఏదో మాయోపాయంబనన్నము. నిన్నెవ్వరు వేలెత్తి లెక్కింపరు. చెడ్డపేరు వచ్చినమాకువచ్చును.

కృష్ణుఁడు॥ అన్నయ్యా! నీపల్కులు చోద్యంబయ్యెడి.

వారియెడలం గల్గిన యనురాగంబున నే నెట్టికార్యంబున కేని నొడంబడుదుననియు; నిజగౌరవంబు వమ్మొనర్చుకొని నిజప్రతిజ్ఞ సరకుచేయక మీ కెల్లరకు నహితమగు కార్య మొనర్తునని యభిప్రాయము సూచించితిరి. దుర్యోధనాదు లన్నట్లు కృష్ణుఁడన్న నల్లవెఱ్ఱిగొల్లఁడని మీరును దలంచితిరి కాఁబోలు. అతిక్రాంతమర్యాదులై చరించిన వారిపట్ల నింక నే నెట్లు ప్రతికూలస్వభావము వహించియుందు? అక్రూరా! శరణాగతుని విడిచి భరతకులంబునకుఁ గళంకముఁ దేఁజాలనని యర్జునుఁడనెనుగా!

బలరాముఁడు—సోదరా! సాత్యకీ! చూచితివా యతని యనుమానము?

కృష్ణుఁడు—మూఢచిత్తా! అర్జునా! నిశ్చయముగా నన్వంచించితివిగదోయి! నీ వినయప్రవర్తనంబులు నిక్కువంబు లనుకొంటి. నీవు ప్రాణమిత్రుఁడవని నమ్మియుంటినిగాని, ఇట్లు భంగపుత్తువని తలంపలేదు?

బలరాముఁడు—ఇది యంతయు నీ స్వయంకృతాపరాధము! పామునకుఁ బాలువోసి పెంచినట్లు లాతనిఁ బెంచితివి. అతని దుర్గుణంబు లీనాఁటికైనను నీవు గ్రహింపఁగల్గినందులకు సంతోషము.

కృష్ణుఁడు—నే నొనర్చిన మహోపకారంబులనైనఁ దలంచి నాశత్రుని విడనాడి యుండవచ్చునే? స్వలాభంబు మది నెంచి నాతోఁ గపటపుఁ గూటమిం జేసితివిగా! నీపేరుప్రతిష్ఠలకు లోటు రాఁగూడదేమి?

బలరాముఁడు—పాండవేయుల ప్రాణమిత్రత్వము ధర్మతత్వము బయలుపడెనా కృష్ణా?

కృష్ణుఁడు—అన్నయ్యా! ఆ కపటాత్ములకు మహాగర్వంబుగలదు. అనంతపరాక్రమవంతులమని వారికిఁగల గర్వంబు సర్వంబు ఖర్వంబొనర్తు. ఆమూఢాత్ములకు వినాశకాలంబు సమీపించుటచేతనే దుర్బుద్ధు లుద్భూతమైనవి. అన్నయ్యా! కానిమ్ము. దూతనుగూడ రానిమ్ము. ఆపైసంగతియోచింతము. ఇంతట మనము కొలువు చాలింతము.

సహదేవుని రాయబారము.

అక్రూరుం డేగినపిదప ధృతరాష్ట్రుండు విదురసంజయభీష్మాదులతోడను, గాంతేయాగ్రజునితోడను ప్రసంగించుచు నాఁటిసభలోని ప్రసంగములవలనఁ గృష్ణుని క్రోధాగ్ని రగులుకొనుట నిశ్చయంబని కటకటంబడుచుండె. సుయోధనాదుల తీవ్రమగు ననుచిత సంభాషణములచేత వ్యవహారములు ముదిరెననియు వగవఁదొడఁగె. తనవారికిఁ బలపరాక్రమమునకన్న ప్రగల్భములు మెండనియుఁ బరిపాలనాధౌరేయతయు రాజనీతియు నెఱుంగరనియు విలపించె. కుంతీనందనునితో నక్రూరుండు కొల్వునం దెల్పినదంతయు నిజము. కృష్ణుఁ డేరికి నజేయుఁ డన్నమాట వాస్తవమని యాంబికేయుండు పలికె. పెద్దలైనను మన మిప్పుడు వినయవంతుఁడును వివేకవంతుఁడును వితరణశాలియుఁ బరేంగితజ్ఞుండును సత్యసంధుండును బుద్ధిమంతుండును గార్యధురంధరుండును సుగుణవంతుండును నగు

నొకనిని రాయబారిగఁ గృష్ణుని కడకనుపు టుచితముగదా యని యాంబికేయుండు పల్కి మఱుఁడ నిట్లనియె. ఆరాయబారియే సమస్తకార్యములఁ జక్కఁబెట్టి ఫలసిద్ధిగాంచి రాఁగలఁడు. అట్టివాని నొకని నియోగింపుఁడు. వైళంబ యాదవవల్లభుని కడకనుపుదము.

ధర్మరాజు—తాతా! ఈ దూతకార్యంబునకుఁ దగినవాని నొక్కనిఁ దమరు పేర్కొనం బ్రార్థితులు.

శంతనునందనుండు కౌంతేయాగ్రజున కిట్లనియె.

ఇట్టికార్యంబునకు దేవతలకేని నశేయుండును, బుద్ధిబలమున బృహస్పతి కీడనందగువాఁడును, చలింపని స్థిరభావంబున నచలశ్రేష్ఠంబున కుద్ది యనందగు వాఁడును నగు సహదేవుండే తగినవాఁడని నా యభిప్రాయము.

అందఱివారును భీష్మవాక్యమునే తలమోపిరి. ధర్మజుఁడు సోదరుం బిలిపింప వా రాతనికి వాసుదేవుకడ వదింపుమని నుడువులు కొన్నిటిం దెలిపిరి. అట్లాతం డందఱివలన ననుజ్ఞలం గొని సను నెడ ధర్మజుం డాతనిఁ జేరఁదీసి యిట్లనియె.

క॥ సహదేవ నీ వచనముల
కు హలాయుధ కృష్ణసాత్యకులుఁ బ్రద్యుమ్నా
ది హరికుమారులు నతికుపి
తహృదయులై పల్కినను బెదరకుము తాల్మిన్॥

అని బుద్ధులం గఱపిన నాతండును వందనపూర్వకంబుగఁ జెవియొగ్గి విని వల్లెయని రథారూఢుండై పరిమిత పరి

జనంబులు గొల్వ ద్వారవతీపురంబునకుం బోయె. రథంబు మొగసాలం డిగి ద్వారపాలకునిచే నాగమనంబు లోని కెఱింగించి యాజ్ఞవడసి యాస్థానమంటపప్రవేశ మొనర్చె. శ్రీకృష్ణుంగాంచి కృతప్రణాముండై యుచితరీతి సత్కరింపఁబడి సహదేవుఁడు భద్రాసనాసీనుండయ్యె.

కృష్ణుఁడు—బావా!

మ॥ ముదమే యుత్తరు ధర్మరాజునకు సమ్మోదంబె భీముండు స
మ్మదలీల న్విహరించునే కుశలమే మత్ప్రాణమైపోల్చునా
త్రిదశాధీశ్వర సూతికిన్ నకులుఁడుం బ్రీగాత్ముఁడే సౌఖ్యసం
పదఁ బాంచాలి మెలంగునే పరిజనుల్ భవ్యాత్ములే యెప్పుడున్॥

సహదేవుఁడు—దేవకీతనయా! భవత్కృపారసమున మే మెల్లరము కుశలులము. కన్నులకు ఱెప్పలవోలె నీవనిశంబును గాపాడుచుండ మా కాపద లెట్లుమూఁడు?

కృష్ణుఁడు—సహదేవా! ప్రొద్దుగ్రుంకుచున్నది. మనమింతటఁ గొల్వు చాలింతము. ప్రయాణపుటలజడిఁ దీర్చుకొనినపిదప సంభాషింపవచ్చును. అభ్యంతర మందిరమునకేగుదము రమ్ము.

మురాంతకుండు సాంధ్యక్రియలనిర్వర్తించి సహదేవునిం బిలిపించి యాతండును దానును సత్యభామా మందిరం

బున షడ్రసోపేతరుచిరాన్నంబుల భుజించిరి. అపిమ్మట సహదేవుండు విడిదికిం జని సుఖనిద్రా పరవశుండయ్యె.

మఱునాటి యుదయంబున సవ్వనజనాభుండు గంధమాల్యాభరణ భూషితుండై యుద్ధవాక్రూర బలభద్రసాత్యకి ప్రద్యుమ్నానిరుద్ధాదులం బిలిపించి వారలుం దానును గొలువుకూటంబున కరుగుదెంచి తత్తదుచితాసనాసీనులై యుండిరి. అంతఁ గృష్ణుఁడు పాండవవీరునిఁ దోడ్కొనిరా వేత్రహస్తునొకనిం బంపెను. ఏతెంచిన సహదేవుని వారి కూర్చుండ నియోగించి మృదుమధురసరస సల్లాపంబులఁ బ్రొద్దుపుచ్చుచు నీ రాకకుఁ గారణం బేమని ప్రశ్నించె.

సహదేవుఁడు—మహానుభావా! నీవు సర్వము నెఱింగియు ప్రాకృతమానవునట్లు రాజనీతి ననుసరించి ప్రశ్నించితివి. మీయాజ్ఞానుసారమిదె విన్నవించుచున్నాఁడ నాలకింపుఁడు. కుండిన పురాధీశుండగు చతుర్ధసభూవిభుండు మాయాతురంగమునెక్కి లోకంబుల సంచరించి క్రమ్మఱనడి నాతని హయఫేనము మారుతవేగంబున యమునానదీ పావనజలంబులఁ దమరర్ఘ్యము విడుచుచున్న తఱిఁ దమహస్తాంజలిఁ బడెనఁట. దానఁ దమకుఁ గోపంబుపొడమి హయమును మీఁదనున్న నరేంద్రుని శిరమును మాసములోఁ ద్రుంతుమని తీవ్రప్రతిజ్ఞఁ జేసితిరఁట. ఇంతలోఁ గాలకర్మవశంబున మా ధనంజయుం డాపురసమీపారణ్యములకు వేఁటాఁడ నేగె. అతఁడది యెఱింగి ధనంజయుని సమీపించి భవదీయనామం బుగ్గడింపక వెఱవున శరణంబు వేఁడినఁ గావం బ్రతిజ్ఞఁ జేసె. అపిమ్మట భయకారణుం డెవ్వండ

నియె. గడగడవడంకుచు మీారని యాతండల్లనం దెల్పె. దాన
నర్జునుం డదిరిపడి విచారించి రయంబున యుధిష్ఠిరుం జేరి యావ
ద్వృత్తాంతమును వినిపించె. అంత యుధిష్ఠిరుండును గరిపురం
బునకరుదెంచి భీష్మాది కురువృద్ధులతో మంతనం బొనర్చి నన్ను
భవత్సన్నిధానంబునకుం బుత్తెంచిరి. ధర్మతనయుండు ముమ్మాదుఁ
దముతో నిట్లనుమనియె.

“నీకరుణావిశేషమున నీ సవ్యసాచి సర్వలోక పూజనీ
యుండై వెలుంగుచున్నాఁడు. అట్టి నరుని యెడ నీవే కినుక
వహించి పరిభవింపఁదగదు. పెంచిన చిలుకను జీకాకుపఱచుటేటి
న్యాయము? దేవాదిదేవా! నీవెఱుంగని దెద్దియును లేదు. మను
జాధీశుఁడు క్రొవ్వి నీ కవమానము నొనర్చినవాఁడు కాఁడు. దైవి
కంబుగ గుఱ్ఱపు నురుగు వీఁచిన గాడ్పువలనం బడియె. కాన నీవు
మనంబున నొకమారు చింతించి కోపంబు వీడి యా తప్పు
సైరించి మనుజవిభుని మన్నించి రక్షింపుము.

పై మాటలాలకించి కృష్ణుఁడు నవ్వి బలరామాదులం
జూచి యిట్లనియె.

“చూచితిరా, మన పాండవేయులను దక్కుంగలవారును
వారికట్టుఁ జెల్లించుకొన నెంతగఁ జెనంగుచున్నారో.”

బలరాముఁడు—సహదేవా! మీా యన్న బలగర్వంబున
విరోధి యెట్టివాఁడో యరయక శరణు నొసంగుట దగునా?

సహదేవుఁడు—బావా! నరనారాయణు లిరువురప్ప
ట్టున సమానులే. మనుజాధిపుఁడు బుద్ధిపూర్వకముగ ద్రోహ
మొనర్చెనో లేక పొరపాటో విచారింపక మూఁడేఁజ్జు సాము

సేసి మూలనున్న మునలినిఁజంపెనన్నట్లు బాహుపరాక్రమముఁ జూపెదననుట యార్యసమ్మతము, ధర్మసిద్ధాంతముఁగాఁబోలు!

సహదేవుని పల్కులకు నీలాంబరుండు పక పక నవ్వెఁ. గదుండు పరిహాసమొనర్చె. కృతవర్మ కృష్ణునకుఁ గన్నుఁగీటె. సాంబుఁడు తల పంకింపసాగె. అసమబాణుఁడు భుజంబప్ఫళించె. ఉగ్రసేనుండు చేతులందట్టె. అనిరుద్ధుండు చేకితానుపైఁ జేసాచి మీసంబుల మెలివైచుచుండె. ఋషభుఁడును చారుదేష్ణుండును బొజ్జలు పటపటంగొట్టిరి. సారణుఁ డట్టహాసంబు నొనర్చె. సాత్యకి పెదవివిఱిచెను. కొలువంతట గుసగుసలు చెలంగె. అట్టి సభను సహదేవుండు కలయం జూచి గను లెఱ్ఱఁజేసి యిట్లనియె.

“సభాసదులారా! మీచర్యలు కడుంగడు విచిత్రంబులు. నా సామభాషణంబులకు సభవారెల్లరు విపరీతార్థంబు లొనర్చుకొనినట్లు తోఁచెడిని. బాంధవ్యంబు నెంచి యీపగిదిఁ బల్కితినిగాని వేరుగ నెంచకుఁడు. బలప్రతాపాదుల ఖండనంబె వెలివెట్టు.

కృష్ణుఁడు—బావా! ఆగ్రహింపకుము. మావారు తమరెల్లరు మదించిన యేనుఁగులవంటివారనియు, మూఁడు లోకంబులఁ బేరుగన్న శౌర్యతేజోనిధులనియు, నాహవంబున నత్యుగ్రులై మలమలమాడ్చికొని తిందురనియు నెఱుంగక పరిహాసించిరి. అయ్యో! మీబలమెక్కడ! మీరెక్కడ! ఆదినుండియు మీరు నిజప్రతాపంబున వెలిఁగినవారు. కురురాజొనర్చు క్రౌర్యములఁ గాచుకొంటిరి. రాజసూయంబు నొన

ర్చిన రాజాధిరాజులు, మయసభనార్జించిన మహాశూరులు, ఖాండవారణ్యంబు దహించిన యఖండబలులు, పాంచాలి కరాభవంబు నాఁడతియువలువ నార్జించితెచ్చిన యక్షీణబల విక్రమోపేతులు. అట్టివీరాకు ముదుసలులగు నదీతనయుండును, కుంభజాదులేమిచేయుదురు గాని శూరాగ్రేసరులగు సుయోధనానుజులు నూర్గురు, అందఱికన్న మిన్నయగు సూతపుత్రుండల యంగరాజగు కర్ణుండు, వసుధాధీశులు బానటనై యున్నారు. అట్టి వీరాచే సురక్షితుఁడగు నృపాలునెట్లు వశపఱచుకొని సంహారింపనగు?

బలరాముఁడు—సోదరా! నీవెవ్వాడును సల్లాపంబులతో గాలము వృథపుచ్చెదవు. కాఠిన్యము వహింపవలసినపట్ల కూడఁ జలోక్తుల నుపేక్షచేయుదువు. నీబలంబును నీవెఱుంగవు. పరుల బలంబును బ్రస్తుతించుటలో నిధివి. నీవు నిజంబుగ నలిఁగి ఘనరోషంబున నేత్రయుగ్మంబులనుండి యగ్నికణంబులఁ గురిపించుచు రణభూమిని నిలిచితేని యర్జునుండన నెంత? మిగిలినవారిని మేమును నిర్లక్ష్యముగ నెదిరింపఁగలమను ధైర్యమున వచించుచున్నాను. అర్జునుండు దివ్యబాణంబులం గల్గియున్నాడను నదిరిపాటునను శౌర్యంపుతేవను భవద్విరోధియగు నృపునిఁ గరుణించెను. నీప్రకటిత మానుమని సాహసించి రాయబారమంపెను. నీని మాటలు వినుటకు నాకసహ్యము జనించి తీవ్రమగు వ్యాగ్రహాకారణ మగుచుండ నీకందలి మాధుర్యమేమో సావధానముగ నాలకింతువు. ఏమేమో బదులాడుదువు. నీ నానుడు వ్యవహారము

చూచెడి వారికిఁ బాండవేయులతో వైరమునకుఁ గృష్ణుఁడు సందేహించుచున్నాఁడను నొక గొప్ప లోపమును వెలిబుచ్చుచున్నది. కాకున్న యోచించి చూడుము. వారు ధార్తరాష్ట్రులతోఁ జెలిమి నీయాజ్ఞఁగాని యొనర్చిరా? వారు సమరసన్నాహమున నున్నారు. నీవు మీనమేషముల లెక్కించుచున్నావు. నీవన్న వారికి లక్ష్యముండియు నీతోడి కయ్యమునకు వెనుదీయు నుద్దేశించియే యుండినయెడల మున్ముందు వారు కౌరవేయుల నేలఁ జేరఁబోదురు? నీయందు నీ వనుకొని యున్నట్లు భక్తిశ్రద్ధలు, గౌరవస్వభావము, బంధుఁడవను నెనరు, ఉపకారమొనర్చినవాఁడవను కృతజ్ఞతయున్నవారే యైనయెడల జ్ఞాతుల పాదములఁబట్ట నేలపోదురు? నీతో వైరము నెల్లనివారై రాజు కపటముగఁ బ్రాణదానమునకు వేసుటచే మోసపోయి యుభయ మొనంగి యున్నవారేయైనచోఁ దొలుదొల్తనే నీ సన్నిధిం జేరి కార్యమిటు తప్పివచ్చె. నేది త్రోవయని యడిగి యుండరాదా? వారి కృత్రిమచర్యలు, నధర్మపు టుద్దేశములు, యథార్థములని నమ్మి దీర్ఘసందేహంబునుండి తెప్పరిల్లలేకున్నావు. నోటికివచ్చినట్లు వారు ప్రేలుచుండఁగా నీవు దుడుకుతనపుమాట నోరు జారివచ్చునేమో యని వదిలంబుగ భావమందు హాస్యంబులాడుచు వినోదాంబుధి దేలుచున్నావు. నీ యుపేక్షయు, నీ నిరర్థకపుఁ బ్రసంగములును నాకు రుచించుటలేదు. కాలహరణంబునకుఁ గారణంబులగుచున్నవి. అభిమానాతిరేకము నిన్నదిమిపెట్టి కోపంబును దిగమ్రింగఁజేసి రోషంబును జంపుకొన హెచ్చ

రించుచున్నను నీ ద్రోహులు పైకుఱికి మద్బాహుబలంబును వారిపైఁ జూపుదనుక నా యాగ్రహానలము చల్లారదు. నాకీ లోకంబునంగల రాజులన్నం దృణప్రాయులు. ఇందున్న వారెవ్వరైన నాతోడ వచ్చిన రండు. నేనింక క్షణముండఁజాల.

అట్లు హలాయుధుఁడు రౌద్రాకారుండై యుండతి మొద నిర్లక్ష్యభావంబుఁ జూపి తానొక్కఁడే యుద్ధసన్నద్ధుఁడై యేగ దిగ్గున లేచి చనునెడఁ జక్రపాణి యాతని కేల్వట్టి యిట్లనియె.

"సోదరా! మత్కృతకాలహరణంబునకు సైరింపుము. అర్జునుండన నెంతవాఁడు? వినుము.

తే॥ గీ॥ నా సహాయంబు లేకున్న నరుఁడు నరుఁడు
నా సహాయంబు గలిగిన నరుఁడు హరుఁడు
ఇత్తెఱంగల్ల భీష్మాదు లెఱిఁగి యెఱిఁగి
యేలచేసిరి యిప్పని బేలలగుచు॥

సహదేవుఁడు—అబ్బాహూ! ద్రుపదునిఁ బట్టి దెచ్చి ద్రోణున కర్పించినవాఁడును, మత్స్యయంత్రమును దెగ వేసినవాఁడును, పాంచాలికై మహీపతులఁ గెల్చినవాఁడును మా యింద్రసూతి నీసహాయంబుగో నను కాఁబోలు. గాండీవ, దేవదత్తాదు లాతనికిఁజాలు. పెరవారల సహాయం బాతఁడపేక్షింపఁడు. ఆ జగదేకవీరుండును, అసహాయశూరుండగు పార్థునితో నాఖండలాదులు దురంబున నిలుకోఁజనోపరు. ఇట్టివీరునకుఁ దోడ్పడనున్న మహావీరుల ప్రభావంబు లాలకింపుము. విశ్వ వాక్య పరిపాలనార్థ మేకపత్నినేని స్వీకరింపనొల్లక యావ

జీవము బ్రహ్మచర్యవ్రతమునఁ జరించుచున్న నిష్ఠాగరిష్ఠుఁడగు భీష్ముఁడు. ఆతనికి దాసోహమ్మనని వారు భూవలయంబున లేరు. బాహుబలంబున దిగ్విజయయాత్రనొనర్చిన యా యాపగానందనుని నెదిరింప మీలో నెవ్వరికగు? అస్త్రగురుండును, అతిరథశ్రేష్ఠుండును మేరునగధీరుండును, నగు ద్రోణాచార్యుఁ డస్త్రంబులఁ బ్రయోగింప నిల్వఁగలవారేరీ? ముందునకైనఁ గానరారే? కృపుఁడు పేరునకుఁ గృపుఁడుగాని రణరంగమున నాతఁ డమిత నిష్కృపుఁడు సుమీ! తులలేని ప్రతాపముగల్గి యమోఘాస్త్రంబులు కైవసమై ప్రకాశించుచున్నాఁడు. ఆతని మ్రోలంబడిన వానిఁ దప్పింప నావిధికైన దుర్లభము. మురారీ! యాతనిని డీకొనఁగల్గిన యాతనిం జేర్కొనుము. నిశ్ఛిద్రభావంబునఁ గోదండంబెక్కించి రణక్రీడ నొనర్చు నశ్వత్థామఁ జూచిన వీరి వాచాప్రౌఢి చల్లఁబడకున్నె? గదాదండముఁ జేబూని మత్తమాతంగమువోలె విజృంభించు మా భీమసేనుండు మూకలఁ జెండాడుతఱి వీరెల్ల రేమగుదురో? చేతులు త్రుప్పు పట్టియున్నవి. పనిలేదుగదా యని పెనువగం గుందుచున్న వాయుపుత్రునకుఁ బని గల్పించి యాతని వందనంబులకుఁ బాత్రుఁడవుగా నున్నావుగా! కృష్ణా! ఈతనికిఁ దోడుగ సుయోధనుండను మత్తకరియు నీవాహినుల గబళింప సిద్ధముగనున్నది. జలధిగభీరుండగు నర్కపుత్రుని సమీపించుటయు దుస్సాధ్యము. తీవ్రశరజాలములచే రూపుమాపివేయు. ఇఁక నాభీమాత్మజుండగు ఘటోత్కచుని మాయ తెలియంగరానివి. అశేష విశేషంబులారసిన బుద్ధిమంతుఁడగు

శస్త్రాస్త్రకళాకౌశల్యుండగు శల్యుం డజేయుఁడు. ఆహవఘనులగు ద్రుపదాదులును, భుజబలాధికులగు విరాటాదులు, దండిమగలగు సోమదత్తాదులు పెక్కురు గలరు.

ఇట్లు మాసైన్యసముద్ర ముప్పొంగివచ్చుచున్నది. విజయుని ప్రతిజ్ఞ నెరవేర్పఁబూని ముదంబున నెల్లరు మైమఱచి చెలరేఁగుచున్నారు.

సీ॥ కపికేతనంబు భీకరతఁ దోఁచకమున్న
తొడరి గాండీవ మెక్కిడకమున్న
పటుతర శరపరంపరలు పర్వకమున్న
బాంధవుల్ ధరణిపైఁ బడకమున్న
రక్తవాహినులు ఘోరముగఁ బాఱకమున్న
సకల బలంబులుఁ జావకమున్న
యాదవు లుగ్రబాణాగ్నిఁ గ్రాఁగకమున్న
ధృతి వాహినీశులు తెగకమున్న
దేవదత్తరవంబు వీతేకమున్న
తెల్లగుఱ్ఱపుఁ గొదమల తేరురాక
మున్న విజయుండు గాచిన యన్నరేంద్రుఁ
గావు తక్కిన బుద్ధులుగావు కృష్ణ!

మాబలంబునకును మీబలంబునకును పర్వతంబునకును బరమాణువునకును గలయంత వారయున్నది. ఎఱిఁగి ఎఱింగి యాపసుధేనుం జంపుచలంబేల? ముమ్మాటికి సయ్యది మానుటొప్పు.

అట్లు పల్కిన సహదేవు పల్కులు ముల్కుల చందంబునఁ గర్ణరంధ్రంబుల సోఁకినఁ గృష్ణుండు తోకఁద్రొక్కిన భుజగేంద్రుని రీతియు పటలు గుదిచి పెట్టిన కొదమసింగంబు మాడ్కియు రోషించి యిట్లనియె.

కం॥ వినవోయి మున్నొక చతు
ర్థనఁ జంపెదనంటి నిపుడు ధర్మతనయు ను
క్కలి డించి సంగరస్థల
మున నందఱఁ ద్రుంతుఁ జక్రమునఁ జిత్రగతిన్॥

దీనిన్విని సహదేవుండు మారాడక పోయివచ్చెదనని యందఱకు నెఱింగించి కొలువుకూటంబు వెడలివచ్చి రథారోహణంబు గావించి రయంబునఁ గరినగరంబున కరుదెంచి ధృతరాష్ట్రుకొల్వుకూటంబునఁ జేరి జరిగిన కథాంశంబులెల్లయు సక్రమంబుగఁ దెలిపె.

ఆపల్కులాలకించి దుష్టచతుష్టయంబు బీరంబులఁ బల్కుచుఁ గదలిపోవుదము లెండని మహాట్టహాసంబొనర్ప భీష్ముండు వారలవదల్చి మీరలికార్యంబు తెఱఁగెఱుంగ; రాత్రిపడకనిలువుండని వైచిత్రవీర్యునుద్దేశించి యిట్లనియె.

“ధర్మనందనుండును రారాజును చతుర్ధశసంరక్షణార్థంబు రాజవరుల బంధుల మిత్రుల నిందుఁగూర్చిరి. ఇయ్యది యష్టాదశాక్షౌహిణీసంఖ్యయయ్యె. కృష్ణునితోడి కయ్యంబొనర్పఁ దగిన యోధుఁడజ్జునుండుదక్క మరొకండు గానరాఁడు. కావున వాహినీకధిత్వంబున కీక్షణంబె యాతనిఁ బట్టభద్రు నొనర్చుట చాలమేలు”

అర్జునుఁడు — దేవవ్రతా! తమరిట్లను టాడ్వానే? యోధాగ్రేసరులగు మీరును, కృపుఁడును, ధనుర్గురుఁడును, రాజీవాప్తసూనుఁడును, రారాజును, నశ్వత్థామయు, భీముండును మున్నగు వారందఱోయుండ నాకభిషేకవైభవంబేటిమాట? త్రిలోకవిఖ్యాత కీర్తిసాంద్రులగు మీరలొక్కరే యీపదవికిఁ దగినవారు. నాసేర్పుకొలంది నేనును రిపులతోడం బోరెద.

భీష్ముఁడు — పార్థా! వీరల నిల్లంగాదనుట గాదుగాని కృష్ణునితోడి వైరంబు మిగిలిన వైరులతోటిపాటిదిగాదు. కావున జతుర్ధనుని గావను, నంబుజోదరు నెదిరింపను నీవే సమర్థుఁడవు. నీపక్షమందున యుధిష్ఠిరదుర్యోధనకుశ్యానన శకుని సైంధవ ద్రుపద విరాట ఘటోత్కచులును దుష్టకేతుండును సుదక్షిణ పాండ్య భగదత్తులును కేకయు లేవురును నీలుండును రుక్మియు శల్యుండును విందానువిందులును గూడఁ బదునేనమంద్రుఁ నక్షౌహిణీపతులయ్యెదరు. వీరలు నేనును కురు కృపాశ్వత్థామ కర్ణ బాహ్లిక సోమదత్త భూరిశ్రవులుం దక్షిణ యోధవీరులును సంగరంబున నీచెప్పిన రీతిని దిగాదము.

అర్జునుఁడు — తమ యాజ్ఞను శిరసావహించెదను. నాకు సారధియుం జక్రరక్షకులును మహాయోధులుఁ గావలయును.

భీష్మునకు వల్లెయని యమసుతు నక్షౌహిణీ పతిత్వంబునకు నొడంబఱచి శల్యుసారథ్యంబునకు నియ్యకొలిపె. ఉత్తమౌజుండును యుధామన్యుండును జక్రరక్షకులుగ నేర్పఱుపఁబడిరి. అంత నుత్తమంబైన యభిజన్ముహూర్తమున జాహ్నవీ

నీరములచేత నభిషిక్తు నొనర్చి సకలాక్షౌహిణీ పతిత్వంబునకుఁ బట్టంబుఁ గట్టిరి.

## చతుర్థుని నిబ్బరము.

"అపాయంబునుఁ బాపుకొన నొక యుపాయంబును గన్ని పార్థుం జేరఁబోవు నెడ బ్రేటుపడియున్న బ్రాణిసఘుటచే నీ ప్రయత్న మేమగునో యని యనుమానము. ఆ శరణాగత రక్షణ బిరుదాంకితుం డభయ మొసంగిన పిమ్మట సజాత శత్రుం డేయుద్దండకి నేనిఁ బల్కునేమో యని దిగులు. ఈ దిగులునసే రాచబింకంబును బోనాడి యతివినయంబుగ నాతని దర్శింప నేగినపు డెపుడాతని చూపులు పైఁబడునా యని వేచి యుండి, యనుగ్రహమున్నే నాయంతట నేనే ఫలాని వాఁడనని చెప్పుకొనుచు నతుగునకు మ్రొక్కులొత్తితి. ధర్మనందనా! ధర్మంబు వీడవలదని బ్రతిమాలుకొంటి. ఈతఁడు ప్రసన్నుఁడైన పిమ్మట వాయుపుత్రుండేమనునో యను భయము. అతండు కూడఁ గృష్ణునిదే పొరపాటను దనుకఁ బ్రాణములు గొట్టుకొనుచునే యుండెను. అందఱును నన్ను రక్షింప నంగీకరించిరి కదా యని వారికిఁ బంచసహస్ర వందనంబు లర్పించి సంతసింపనుండఁ గౌరవసభఁ జేరబోవఁ బ్రయాణము సిద్ధ. వెంటనే నామనంబున వారేమైన సంతరాయంబులఁ గల్పించి సన్నిధుపుఁడని పంచపాండవులకు బోధింతురేమో యని మనంబున విషాద మేర్పడియె. అందు నాకనుకూలంబుగ వ్యవహారంబులు చక్కంబడుచున్న సమయంబున శ్రీకృష్ణుఁడు ప్రవేశించుఁగనే యాట మధికమయ్యె. అయ్యో దైవమా! నీర

ల్లరునుఁ గలిసి కృష్ణునకు నన్నప్పగింతురాయను భయమేర్ప డియె. వారెల్లరానాఁ డక్రూరుని వలనఁ గృష్ణునకంపు వినయ పూర్వకసందేశంబునుబట్టి నట్టేటఁ బుట్టిముంచెదరాయని సం దేహము పొడమె. అప్పటికిని నవకాశములటస్థించినపుడెల్ల నామనంబునఁగల భీతియు నాతురతయు విశదమగునటు "ఆర్యు లారా! ఆనారాయణుఁ డాగ్రహావేశమున మీపైదండు విడియు దారుణసంగ్రామంబున మీకెవన్నట్లు రక్షించెదరో నీటముం చినను బాలముంచినను భారము మీయదియే" యనుచుంటి. "మేముజీవించి యున్నంత కాలము నీవుభయపడనక్కఱలేదు. నిర్భయచేతస్కుఁడవై వర్తింపు" మనివారుబదులాడు నెడఁ జం కలుగొట్టుకొనుచు వాక్రింపుచుంటి. కానికృష్ణునిం గూర్చి భీష్ముండాఁడు పల్కులు నాకధైర్యముఁ గల్గించుచుండె. సహ దేవుఁడు రాయబారిగఁ జేగి వచ్చినపిదపనాతని రాయబారపు విశేషములు తేటపఱచు నెడ నేను కొనయూపిరితోఁ గొట్టు కొనుచుంటిని. రణరంగమున ధర్మజుం దక్కనెల్లరఁ గసిమసం గెదనన్న నదిరిపడి నీకర్మమునీది పో పొమ్మని నాకుద్వాన ముసఁగిమొక్కఁడవా రక్కఁడ నర్దుకొందురేమోయని తహ తహపడితిని. తుదకు నాప్రయాసమంతయు వ్యర్థమయ్యె. ఎందఱిపాదములం బట్టినను జీవంబులు దక్కవయ్యె. నిజ బాంధవాళిని నాలుబిడ్డలను బయలుదేరి వచ్చువాఁడు భీషిం చువచ్చుటయే కడసారిచూపులయ్యె. ఎంతక్రిందమీఁదఁబడి నను నసురులుదక్కకపోయెఁగా. పైపెచ్చిందఱునాకైయసు రులు గోలుపోవనున్నారు. దినమునకొందఱు ననుబోలిన

నిష్ప్రయోజక శిఖామణులు గిట్టుటలేదు? వారలం దలఁచు వారెవరు? నేనట్లుగాక చిరస్మరణీయుండనై యుండు పాపాధముండగు చతుర్థవ నామాంకుఁడ. నామూలమునఁ పాండవ కౌరవ యాదవబలంబున యోధానుయోధులును రాజాధిరాజులును మడిసిరను ఖ్యాతిసంపాదించుకొంటి. వీరల దుహితలులోనగు నాఁడుబలగము నాకు నిత్యముంగ శపారతు లొసంగుచుండు" ననుచుఁ జతుర్థనుండాత్మలో వాపోవుచుఁ దన విడిదియందుండు నెడ నాతనికి భేరీరవంబు విననయ్యె. అదేయ్యది యని విచారింపనర్జునానుమతంబున దుర్యోధనుండు సకలసైన్యంబు వారలఁ గురుక్షేత్రంబునకు నడుపుఁడని భేరీమ్రోగించుచున్నాఁడని తెలిసికొనియె.

మఱుసటినాఁటి ప్రభాతంబున సకలసైన్యాధిపతులును సుచితరీతి నలంకృతులై పరమసంతోషంబున సన్నద్ధులై యుండిరి. విజయుండంతిపురంబునకుంజని గాంధారీ ధృతరాష్ట్రులకును విదురసంజయులకును నేతద్వృత్తాంతము విన్నవించి ముదలఁ గొని వెడలి భూసురాశీర్వాదంబులును మంగళపాఠక గీతారవంబులును దుములంబులై రోదసినిండ దివ్యరథారూఢుండై యుదయాద్రిపైఁ బొడకట్టు చండభానుండునుంబోలె భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణగాంధారరాజ రాధేయాదులుం జతుర్థనుండును యుధిష్ఠిరాది సోదరులును దమతమ చందంబు మెఱయ సామజసైంధవస్యందనారూఢులై తోడరా నిజరాజధానియగు హస్తిపురినిర్గమించిరి. అత్తఱి భిడుగులుపడుట నెత్తురువానగురియుట మున్నగు నశుభంబు

లంగాంచి యెల్లరయాత్మలు భయంబునొందె. శాంతవవాను వృత్తంబున సగ్గాండీవి మహాశ్వేతంబులకు శాంతివిధానంబుఁ గావించి ముందునకు నడిచె. విజయదుందుభి కాహళ శంఖ నినాదంబులు దిక్కులునిండ సేనలు కురుక్షేత్రంబున కరుదెంచె. అర్జునుండాత్మస్కంధావారంబునకురక్షగఁ దూర్పున ధృష్టకేతుని, నాగ్నేయంబున విందాను విందులను, దక్షిణభాగంబుననుదక్షిణుని, నైరృతి ప్రదేశంబున నీలునిఁ బశ్చిమస్థలంబునఁ గేకయులను వాయువ్యంబున సంగాధీశ్వరుని, వారిమధ్యంబునఁ బాంచాలరాజమత్స్యవల్లభులను నియమించె. సుయోధను నియోగంబున సేవకులును సకల పదార్థంబుల వలయు వారలకు నొసంగుచుండిరి. ఎల్లజనంబులును సంతోష భరితాత్ములైయుండిరి.

అట సయ్యదువిభుం డాత్మానుచరులచేఁ బాండుపుత్రులు శమంతపంచకంబుననుంట యెఱిఁగి సర్వే. పిదపఁ గొలువుకూటంబునకుఁజని బలభద్రాదుల రావించి వైరులు కురుక్షేత్రంబున కేతెంచిన విధానంబునంతయు వివరించి మనము చ్చటికిఁ బోవలయు; వారలకు సమానులైన మనయోధుల నేర్పఱచెదనని హలాయుధున కిట్లనియె.

"భీష్మునకు నీవు, అశ్వత్థామకు శైనేయుడు, వృకధ్వజుండు ద్రోణునకు, చేకితానుండు బాహ్లిక తనుజాతునకు, ననిరుద్ధుండు కృపునకు, నుద్ధవుండు మత్స్యేంద్రునకు దీప్తిమంతుండు రాజరాజునకు సాంబుండు, సూర్యతనయునకుఁ, బుష్కగుండు పాండ్యభూపాలునకు, గాందినీసుతుండు ద్రుపదునకు, సువంద

నుండు సుదక్షిణునకు, కృతవర్మ శల్యునకు, శుకుండు సైంధవునకు, అర్జునునకు నేనునుఁ జాలి నిలుచువారము. తక్కిన వారి నట నిర్ణయించుకొనవచ్చును. చారుదేష్ణా! ప్రయాణభేరి వేయింపుము."

అంతఁ గొలువుసాలించి కృష్ణుఁ డంతిపురంబునకుఁ జనియె.

అయ్యవసరంబున యదువృష్ణిభోజాంధకాదులు యుద్ధసన్నద్ధులైరి. కృష్ణుండును సముచిత శృంగారంబంగీకరించి యంతఃపురంబు వెడలె. సకల సాధనయుతుండై గరుడకేతనముతోఁ బ్రకాశించుచున్న తేరునకుఁ బ్రదక్షిణము గావించి మహాదేవతల దీవనలంగొని కృష్ణుడు రథారోహణంబుఁ జేసె. బలభద్ర సాత్యకి ప్రభృతి భ్రాతృవ్రాతంబును బ్రద్యుమ్న సాంబసారణ చారుదేష్ణాది కుమార సంఘంబునుగూడి తమ తమ బలంబులుగొల్వ నిజకేతనచ్ఛత్రచామర శంఖ శిరస్త్రాణ తనుత్రాణ, ధనుర్బాణాది నానావిధచిహ్న చిహ్నితంబులగు రథంబులెక్కి వెంబడించిరి.

ఇవ్విధంబున నశేషబలసమేతుండై కదలి రాజమార్గంబున నల్లనల్లనఁ జనుచున్న కంసవైరిపైఁ బౌరపుణ్యాపురంధ్రులు కనకమయసౌధాగ్రంబులనుండి జయజయధ్వనులొనర్చుచుఁ బుష్పంబులంజల్లిరి మేటికయ్యంబులం గెల్చిన హరి కౌరవపాండవేయుల గెల్పుటకుఁదా నేగవలయునా? ఎవ్వరినైన నిందులోని వారినొక్కరినంపినఁ జాలదాయని కొందఱనుచుండిరి. అట్లుకాదు. వారలలోను నదీనందనుఁడు, ద్రోణాదా

ర్యుఁడు, కర్ణుఁడు, అశ్వత్థామ, భీముఁడు మున్నగు బలాధికు లధికులుగలరని మఱికొంద ఱనుకొనుచుండిరి.

అవ్విధంబునఁ గృష్ణుండు బంధు భ్రాతృపుత్ర మిత్రాది జనంబులు పరివేష్టించి కొలువ శమంతపంచకంబునకుం జనుదెంచి యంతకమున్న పన్నిన నిజశిబిరంబునం బ్రవేశించెను.

ఇక్కడఁ బాండవస్కంధావారంబున నొక్క రమ్య ప్రదేశంబునఁ గరదీపికాసహస్రంబులు వెలుంగ బాహ్లికాది కురువృద్ధులును, ద్రుపదాదిబంధువులును, ద్రోణాది మాన్యులును గర్ణాదిప్రభువులును, ధర్మజసుయోధనాది పౌత్రులును బరివేష్టింపఁ గాంచనపీఠంబున గాంగేయుం డాసీనుండై యుండ నాతనితో నర్జునుండిట్లనియె.

“తాతా! కృష్ణుఁడు నిజబాంధవాళితో ససైన్యుండై యల్లదే విడిసియున్నాఁడు. మన సైన్యంబు పోయి పైఁబడ ననుజ్ఞ నిమ్మనుచున్నారు”

భీష్ముఁడు—సరియే. జననాథులను యుద్ధసన్నద్ధులఁ గండనుము.

అర్జునుఁడు— పార్థివోత్తములారా! చతుర్థసభూరమణునిఁ బ్రోచుటకు నేను హరితోఁ గయ్య మారంభింపనున్నాను. ప్రాణంబులు తృణప్రాయంబులుగ నిశ్చయించి యుద్రేకపూరితులై పోరఁగల సామర్థ్యముగలవారు ముందుకు రండు. నిజ బలంబును గూర్చి సందేహించువారు వెనుకకు మరలుఁడు.

అర్జునుని పల్కు లాలకించి యందున్నవారెల్ల నేకకంఠమున నిట్లనిరి.

క॥ "సురనాథతనయ సంగర
ధరణిఁ బ్రాణంబు లొసఁగెదముగా చింతా
మరణేరి నే యనెసు వలు
కెఱుఁగమే నీకేల మమ్ము నిట్లాడంగన్"

అల్లనిఁ గయ్యంబునకుఁ జయ్యన సంసిద్ధులై రండని వారల నర్జునుం డనిపె.

మఱుదినంబున సూర్యోదయ కాలంబునకు విజయుం డత్యుగ్రమూర్తియై వెలువడఁ జతురంగబలములు రణరంగంబునకు నడువం దొడంగె. భీష్మాదులును ధార్తరాష్ట్రశతంబును కేకయ మహీపాలురును నానాదేశాధీశ్వరులును దమతమ చతురంగబలంబులు గొలువ సంగరోచితాలాపంబు లాడుచు నాతని వెంబడించు చుండిరి. అంత నర్దేవేంద్ర నందనుం డందఱం గలయంజూచి భీష్మపాలికేగి మానుషవ్యూహంబు నన్నదనని తెల్పి యనుజ్ఞవడసి వివిధ శస్త్రాస్త్ర ప్రవీణులైన వీరబలంబు నొక్కమ్మడిగఁ జేర్చి వారికిం బ్రాపుగ వాయువేగులైన గుఱ్ఱపుదళములఁ గుదుఱుపఱచి వానికిం గాపుగా రణశూరులచే మీఱు తేజులునిచి వానికిం దోడుగా గజారూఢులనుండ నియోగించి మానుషవ్యూహ మొనరించె. దీనికి ముందట గాంగేయ రాధేయులును దానును వామభాగంబున గురుకృపాశ్వత్థామలును దక్షిణపార్శ్వంబున భీమధృష్టద్యుమ్న ఘటోత్కచులును నడుమ యుధిష్ఠిర, నకుల, సహదేవ, దుర్యోధన, దుశ్శాసనాదులును జతుర్థనుండును వెనుక బాహ్లిక సోమదత్త భూరిశ్రవులును నెడనెడం దక్కిన వారలు తమ

తమ తనుత్రాణ శిరస్త్రాణ చాపబాణ తూణంబులు ధరియించి హస్త్యశ్వరథారూఢులై వీరాలాపంబులు నిగుడ పడమర మొగంబై యుండిరి.

అటఁ గాంగేయు లాయోధనంబున కేతెంచు విధంబెఱింగి బలరాముండు పొంగి బలంబులు వెలువడ నాజ్ఞయొసంగె. గరుడకేతనంబు గగనంబున వెలుఁగఁజేయుచున్న యరదంబును హరి యధిష్ఠించి పాంచజన్యంబొత్తె. సీరముసలంబులం జేఁబూని భీకరాకారుండగు బలభద్రుండు ప్రళయకాలరుద్రుండో యనం బ్రవేశించె. శస్త్రసాంగత్యమున న్విరోధికిఁ గాలుండో యననొప్పు సాత్యకి యుద్ధభూమిం జేరె. మత్స్యకేతనముతో యోధావళులు వెంటరాఁ బ్రద్యుమ్నుండరుదెంచె. వారికిరుంద ననిరుద్ధవృత్తి ననిరుద్ధుండును, మహోజ్జ్వలాకృతితోఁ జారుదేష్ణుండును అంబులోచన ప్రతిముండును నానావకేళీధురంధరుండును నగు సాంబుండును మున్నగువారు రణరంగంబునకుఁ జేరిరి. భానుదేవుండును సారణుండును శతదేవుండును వరూధియుఁ జిత్రబర్హియు నాదిగాఁగల యోధులు దమతమ సేనాసమేతులై సింహనాదంబులు సేయుచు శంఖంబుల బూరించుచుఁ గృష్ణునింగూడి చనిరి. వీరభటులంగలిగి మొదలేక ఘోషించు విజయభేరీ మృదంగకాహళాదుల యారవంబుల నమరి యిఱువది యక్షౌహిణుల సైన్య సముద్రం బర్జునద్వీపంబు ముంపుటకోయన బయలువెడలె. అంత నాహరి పాండవేయుల మానుషవ్యూహమును గాంచి వైరులు దిగ్భ్రమనొందమహాచలవ్యూహంబును దాఁ జేర్పఱచె. అట్టి మొగ్గరంబు

నకు మున్మున్నఁ దానును, బలభద్రుండును, సాత్యకియు వామభాగంబునఁ బ్రద్యుమ్నానిరుద్ధ కృతవర్మలును దక్షిణపార్శ్వంబున గదసాంబ చారుదేష్ణులును మధ్యప్రదేశంబున బంధుమిత్రామాత్య సహితుండై యుగ్రసేనుండును బశ్చాద్భాగంబున నుద్ధవాక్రూర చేకితానసారణాదులును నడనడ బృహద్భానుభానుదేవాది కుమారులు మెఱయుచుండిరి.

వీరల యుద్ధంబుఁ దిలకింపఁ గుతూహలులై పురందరాది బృందారకులు విమానారూఢులై యంతరిక్షంబున నిలిచిరి.

మోహరంబులు రెండు సన్నాహంబునఁ దారసిల్లినఁ గృష్ణుండు పాంచజన్యంబొత్తె. పాండవేయుల సైన్యంబు బిత్తరవోయెను. సకల యాదవసేనయు నుత్సాహంబుతో సింహనాదంబొనర్చె. అరీతి వారి సేనానీకము నడతెఱంజూచి కోపోద్రేకంబున సుభద్రాకాంతుఁడు దేవదత్తంబొత్తె. గురుఁడు, కృపుఁడు, ద్రోణీధర్మపుత్రాదు లద్భుతంబుగా శంఖంబుల మ్రోయించిరి. ఆసమయంబున దుశ్శాసనుండు వాసవింజేరవచ్చి సెలవుఁగొని సేనాసమితిని రయంబున రణంబునకుం బురికొల్పె. వారును నుల్లాసంబున యాదవసేనం దాకిన నుభయ సైన్యంబులును బోతరించిన యాఁబోతులరీతిగను గంధసింధురంబుల చందంబునను గొదమసింగంబుల తెఱంగునను దలంపడి బోరిరి. కయ్యంబు కడుభయంకరంబైయుండె. తనను దాకిన దుశ్శాసనుని సాంబుఁడు విశిఖంబులనొంచి వికర్ణునిపైఁ గవిసి సారథింజంపె. తెప్పరిల్లిన దుస్ససేనుఁడు రయంబునఁ దీవ్రశరజాలంబు మగుడ సాంబునిఁ జేరి

దుశ్శాసను నొక నిశితబాణంబున నొవ్వనేసె. సాంబుని తమ్ముండగు సారణుఁడు వికర్ణుండాకి సారథింగూల్చిన వాఁడును రోషపూరితమానసుండై సాంబుని నొకక్రూరబాణంబున నొంచి హయంబులఁగూల్చి కేతనంబునురాల్చె. సురనదీసూనుండు హరిపూర్వజన్ముని, సాత్యకిని భీముఁడును, ద్రోణుండు కృతవర్మను, గర్ణుడనిరుద్ధుం దాకిరి. అనిరుద్ధుండు బకధ్వంసిచాపంబు ఖండించె. బలరాముండు భీముని రథాంగంబులఁగూల్చె. సాత్యకి యాతని కేతనంబునుఁ గూల్చె. అప్పుడు భీముండు రౌద్రమూర్తియై చండభాస్కరునికంటె మండిపడుచు కెందినముఖంబు బరుల వడలుగొల్ప భీకరంబుగ గదాదండంబును గిరగిరం ద్రిప్పుచుఁ బటుతరవేగంబున నేగి హలాయుధుని తేరునుగ్గొనరించె. సీరియుఁ బాదచారియై మరుత్తనయు సంహారంబొనర్పఁ గ్రోధావష్టంభమునఁ బఱుదేరుట మహావీరుండగు సవ్యసాచికనుంగొని రోషావేశంబున ధృష్టద్యుమ్నాదులు తోడరా నా ప్రదేశంబునకు వేగవచ్చె. అంతమున్న భీష్మాదులు విశ్వంబెల్ల వడంక నార్పుచు నందుఁజేరి శరజాలంబుగుప్పించుచుండిరి. ఆకాశసంచారులు విభ్రాంతినొంద శంఖత్పాంచజన్యారవంబొనర్చుచు దైత్యధ్వంసి యందుఁజేరి యొక్కనిమిసమున భీష్మాదుల నొప్పించి యొకయక్షౌహిణీబలంబును బిలుకుమార్చె. అయ్యవసరంబున నర్జునుండు గర్జారవ కాలమేఘంబు చందంబున సింహనాదంబుఁజేసి దేవదత్తంబుఁబూరించి కర్ణగాంధారేయులఁ గయ్యంబునకుఁ బురికొల్పె. హలాయుధుండు సుయోధను తమ్ములగు భీరుబాహుని భీమునిఁ బీనుంగులం జేసిన రారాజర్జునిం జేరి యా

శోకవార్తవినిపించి సురరాజతనూభవుండు రాజులును గజనికాయంబులును తోడరా హాలాయుధుండాకె. ఆతండును జంకక హాలంబు చే రథావళి నుగ్గు చేయుచు రాజులను వాజులను జక్కాడుచుండెను. ప్రద్యుమ్నాని రుద్ధాదులు నాగలి కేళంద్రివృచు సేనామధ్యంబునఁ బాదచారియై భీమార్జునులపైఁ బర్వులిడుచున్న బలభద్రుం గనుఁగొని వాయువేగంబున నాతనికిఁ బాసటగం జేరిరి. ఆజగదేకవీరుండగు ఫల్గునుం డందఱికన్నిరూపులై గన్పట్టుచు నెక్కుపెట్టున శరావళిఁ గుప్పించి పదునార్వురం దును మాడె. అత్తరిఁ గృష్ణుండార్చుచు వెన సందుఁ జేరి వైరుల హాస్తి బులఁ గల వింధ్ల మహాశుగంబులచే సంహరించి వేరొక్కశరంబు నెత్తుటకును తలలెత్తుటకును అవకాశము కలుగకుండునట్లు బాణసముదాయంబుచేఁ గప్పివైచె. వీరలట్లుండ వీరుల వాజులం ద్రుంచె. రథంబుల నుగ్గునుగ్గు సేసె. సారథుల నేలపైఁ బడఁ ద్రోసె. అది గన్గొని యర్జునుండు తోడ్తోడ నేతెంచి కృష్ణునిం దాకె. అప్పుడక్కిరీటియు శౌరియు మించిన మచ్చరంబున నొకరికొకరు దీసిపోక దేహంబుల వాడిశిలీముఖంబులచే నొవ్వంజేసికొనుచు దారుణంబుగఁ బోరిరి. అట్లు వా రిరువురును ఘనంబగు మచ్చరంబున రామరావణులట్లు హుంకారంబులు మెఱయఁ బోరుచుండ మిగిలిన యిరుపార్శ్వముల లోని వీరులును నాయకులట్లే యార్చుచు భీకరసమరం బొనర్చుచుండిరి. ఉగ్రసేనుండు కురువృద్ధగు బాహ్లికునిపై శక్తిన దరింప నది యాతని వక్షస్థలంబునఁ దాకె. నెత్తురుగ్రక్కుచు

నాతండు నేలంగూలె. అదిగని యాతని కుమారుండైనసోమదత్తుఁ డుగ్రమూర్తియై యుగ్రసేను చివ్వనంజేరి యాతని తల నఱికె. అంత నచ్చేకితానుఁడు నూఱుతూపుల సోమదత్తుపైఁ బరికింప నాతండు మదినెంచక బిడుగువంటియొకమార్గణంబున నవ్వీరుంగూలసేసె. మత్స్యనాయకుండగు విరటుండుద్ధవునిచేఁ ద్రుంపఁబడియె. దీనఁ బాంచాలపతి క్రుద్ధుండై సింహనాదం బొనర్చి శస్త్రపరంపరలుద్ధవునిపైఁబఱచి తుదకు శక్తినివదలె. అద్దానితాకుడున కుద్ధవుండు ధరణిం జతికిలంబడి యుసురులంబాసె. అంత నక్రూరుం డడలుచు నాతని ఘోటకంబులం గూల్చి, సారథిందునిమి ఛత్రచామరంబులఁ బుడమిఁబడవైచి యర్ధచంద్రబాణంబున నప్పాంచాలపతి మూర్ధంబుఁద్రుంచి సింహనాదంబొనర్చె. ఆరవంబువిని శిఖండి మహారోషముతో జండతర గమనంబున నేతెంచి పటు విశిఖంబులం గప్పి యాతని ఖండించె.

ప్రొద్దుగ్రుంకుటచే నిరుపార్శ్వంబుల వారును బోరు చాలించి నిజస్కంధావారంబులకుఁ జని మజ్జన భోజనాదులు సలిపి సుఖులైయుండిరి. హతులైన వారిందలంచుకొని దుఃఖించుచు వైరంబు హెచ్చ నెప్పుడెప్పుడు సూర్యోదయంబగునా యని రణకుతూహల చిత్తులై యుండిరి.

అట్లు సమరంబు పదియాఱు దినములుజరిగె. పాండవ సైన్యంబున భీష్మద్రోణ కృపాశ్వత్థామ కర్ణభూరిశ్రవులును, యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవ దుర్యోధన దుశ్శాసనులును, శిఖండి ధృష్టద్యుమ్నులును, శల్యుండును, నుత్తమా

జుండును, యుధామన్యుండును, ఘటోత్కచ సైంధవ విందానువిందులును, నీలసుదక్షిణ పాండ్య యవనకేకయులును, జతుర్ధనుండును, జతురక్షౌహిణీ బలంబులుందక్కఁ దక్కిన బలంబులతోడ బాహ్లికాదులు మడిసిరి. యాదవ బలంబున రామకృష్ణ సాత్యకి గదులును, ప్రద్యుమ్న సాంబసారణ చారుదేష్ణ బృహద్భాను భానుదేవదీప్తిమదరుణాది కృష్ణకుమార వర్గంబును, ననిరుద్ధ చేకితాన కృతవర్మలును, నక్షౌహిణీ ద్వయంబునుదక్కఁ దక్కిన సైన్యంబులతోడం గూడ నుద్ధవాదులు మడిసిరి.

పదునెనిమిదవనాఁడు ప్రభాతసమయంబునఁ బార్థుఁడు మేల్కాంచి కాలోచితంబులం దీర్చుకొని గురుకృపాశ్వత్థామ యుధిష్ఠిర దుర్యోధన కర్ణాది యోధ వీర సమేతుండైయున్న గంగానందనునిం గాంచి యతని యనుమతి నుచితాసనంబునఁ గూర్చుండి యిట్లనియె.

క॥ అనఘా నేఁడిద్విధమున
మొనదీర్పఁగవలయు నందు మురవైరికిఁ గుం
డిన పతి దగులుపడక యుం
డ నుపాయము తలఁచి చెప్పుఁడా వెరవడరన్॥

భీష్ముఁడు—అర్జునా! శకటాకృతిగా వ్యూహముంబన్ని చతుర్ధను నందు దాతము.

అట్లనుజ్ఞఁ గొని వెడలి సకలసైన్యంబులఁ గట్టాయితంబైన రథారోహణంబు గావించి కపికేతనంబు మెఱయ

విజయభేరీ మృదంగ శంఖకాహళాది వాద్యంబులు మెఱయ యుద్ధభూమికిం బోయిరంత.

అర్జునుఁడు శకటాకారంబుగ మహారంబువన్ని దాని లోనంతరవ్యూహంబుగాఁ పద్మవ్యూహంబు పనఃకట్టి దాని మధ్యప్రదేశంబున సూచీవ్యూహంబు నిర్మించి యుద్ధానిమూల స్థానంబునఁ చతుర్ధనునుంచె. ముఖద్వారంబునఁ గేకయ పంచకంబును, పిఱుంద సుదక్షిణుండును, పశ్చాద్భాగంబున నక్షౌహిణీబలంబు మున్నిడుకొని నకుల సహదేవ సహితంబుగ యుధిష్ఠిరుండును దక్షూచీ మూలస్థానంబునఁ జతుర్ధనుండును నతని చుట్టును గురుకృపాశ్వత్థామాదులును నియమింపబడిరి. అర్జునుఁడును గాంగేయుండును వృకోదరుండును భూరిశ్రవాదులుసింహనాదంబొనర్చుచు శంఖంబులఁబూరించుచు నప్పను మొగ్గరంబునకు ముందటనిలిచియుండిరి. యాదవవీరులును సద్దానింగాంచి సింహనాదం బొనర్చుచు నిజశంఖంబులఁబూరించుచు నతిరయంబునంజని యర్జునుసైన్యంబునుందాకిన నిరువాగులుంగలసి పదాతులుఁబదాతులు, రథంబులురథంబులును, దురంగంబులు దురంగంబులును, ఘోరంబుగాఁ బోరం దొడంగె. ధృష్టద్యుమ్నుఁడును చేకితానుండునునత్యుగ్రంబుగ బోరుచుండిరి. ఇరువుర రథంబులు నేలంగూల ముష్టియుద్ధంబునకు గడంగిరి. మిాఱిన బలగర్వంబుల ధృష్టద్యుమ్నుఁడాతని మర్దించె. అది గనుంగొని కృతవర్మ ద్రుపద భూపాల సుతునిందాకె. కృతవర్మ సారథిం గోల్పోయినవాఁడై సారథ్యమును స్వయముగ నల్పుచుఁ బాంచాల విభుకుమారుండు

మూర్ఛపోవునట్లు ఫాలమునఁ దాకనొక బాణంబు నేసె. అప్పుడు శిఖండి యస్త్రంబునఁ గృతవర్మఁ దాకి యాతని కేతన ఛత్ర చామరకిరీటంబుల నేలంగూల్చె. పదంపడి కృతవర్మ శిరముం ద్రుంచె. దీన నారుక్మిణీరమణుండు మేరమీరిన యాగ్రహంబు వహించి విపక్షసైనికుల బాణవర్షంబును గురిపించె. అర్జు నుండును గాలుసేతు లాడించుకొనుట కవకాశము లేనట్లు కృష్ణుని బాణసముద్రమున ముంచె. బలభద్రుండు భీమునిఁ దలపడిన నవ్వాయుపుత్రుఁ డాతని విరథు నొనరించె. వెంటనే యాతఁడు భూమికి లంఘించి భీమునిరథంబును హయంబును గిరగిరం ద్రిప్పి నేలపైఁ గొట్టె. మారుతాత్మజుఁడు సక్రోధుండై తననిండుమగటిమి ప్రకటించుచు సురలబ్బురమంద గదచే హలధరువక్షంబునఁ గొట్టె. ఇంతలోఁ ద్రిపురాంతకుండైన ఫాలాక్షుఁడో యన మాధవుం డామరున్నందనుం దాకె. అది వీక్షించి యురునుండఁడుఁ జేరి హరిం దూలించె. రోషంబున హరిహలాయుధు లిరువురు నరుని యురంబును నొసటను గాఢంబుగఁ దాకునట్లు నారాచంబు లేయ వాసవి యపుడుగఱచి రోషంబున రామకృష్ణులపై సమ్మోహనాస్త్రంబు నేసె. వా రిరువురును మూర్ఛం జెందిరి. దారకుఁడు సత్యసుతుఁడుఁ దోడి వారలం గొంపోయె. వెంటనే యనిరుద్ధుండేతెంచి సవ్యాప సవ్యంబుగ ఘనబాణపుంజంబుల శత్రుమండలిపై విసరె. అయ్యవసరంబున భూరిశ్రవుఁ డెల్లెడలఁ దానయై విహరించు చున్న హరిపౌత్రుఁ డాయఁబోవుచుండ వృకోదరుండు వారించి రోషరక్తాక్షుండై మహాట్టహాసంబున నవ్వీరుని వక్షస్థలంబు

పగుల గదా దండంబు విసరె. దానవాతండు త్రెళ్లకుండు టచే హారిపౌత్రుని మగుడంగదిసి వృకోదరుండు శిరముఁ దెగ నేసె. అట్లనిరుద్ధుం జంపి సింహనాదంబుఁ జేసి సరోవరంబుఁ గలంచు గంధసింధురంబట్లు యాదవసైన్యంబుఁజొచ్చి గదం ద్రిప్పుచు సర్వంబును పీనుగుల మయంబొనర్చుచుండె. మా రుండు సూనుఁడు మదయు బెతెంగి కనుఁగొనల నీరునించి ధైర్యమువహించి వడమునిందాక. పిడుగులవంటి బాణంబు లమితంబుగ నేయ నాతండుగ్రుండై గదాదండంబును వక్ష స్థలంబున కుపలక్షించివేయ నవ్వీరుండు సోలి త్రుటిలో తేల్కొంచి విలయకాలుండువోలె విజృంభించి భీముని మూర్ఛాక్రాంతు నొనర్చె. ఇంతలో నాతని ధృష్టద్యుమ్నుం డెదుర్కొని పుంఖానుపుంఖంబులుగ నిశితశరపరంపరలు బఱపె. అట్లా దండిమగలిరువురొండొరులపై నిష్ఠురకాండం బుల నిగిడించుకొనిరి. తుదకు ధృష్టద్యుమ్నుండు ప్రద్యుమ్నుని శిరంబును హరించి సింహనాదంబొనర్చె. అంత నయ్యాదవ సైన్యంబు దైన్యంబునొంది నల్లెడలం గలియఁజూచు నెడ సాంబ సారణాదులు రథసంబున నందుఁ జేరిరి. ఉభయసైన్యంబుల కును జోరు ఘోరంబయ్యె.

అర్జునుండు దివ్యశరంబుల నారి సంధించి యారథికుల నతివిచిత్రముగఁ గ్రుంచి హారికుమారుల నిశ్శేషంబుగా వధి యించె. దుర్యోధనప్రముఖులు హత శేషబలంబును జంపిరి.

ఇటరామకృష్ణులు సాత్యకిదారకులు నేయు శిరోప చారంబులవలన మూర్ఛందేఱి హతంబులైన తురగకుండా

లంబులను, నుగ్గునుగ్గైన రథావళులను, ద్రెళ్లిన సైన్యానీకంబును
మ్రగ్గిన కుమారవర్గంబునుం గలిగి నిర్మానుష్యంబైన యాత్మ
సైన్యంబుం జూచి శోకవ్యాకుల చిత్తులైరి. అంతనా కృష్ణుండు
మధ్యందినమార్తాండుని వోలె జూడనశక్యంబైన భీకరాననం
బుతో విలయకాలంబునం బొడము విస్ఫులింగంబులట్ల కనుల
నుండి రోషాగ్నికణంబు లురలఁ గల్పాంతకాలమందలి మేఘా
ర్భటంబట్ల గుణారావంబొనర్చుచు శత్రువులు తల్లడిల్లునట్లు పాం
చజన్యంబొత్తి రామసాత్యకు లిరువంకల రాఁగ నడచె. వచ్చునా
మువ్వురిపై భీష్మార్జునులు నిజబలంబులఁ బురికొల్పిరి. ఆమువ్వు
రను నింద్రుండు వజ్రాయుధంబునఁ బర్వతంబులఁ దరిగినట్లు
కుంజరయూధంబులఁ గూల్చిరి. తురంగంబులఁ దునిమిరి. రథికుల
కంఠంబు లవలీలగ నులిమివైచిరి. పెనుగాలి వృక్షఫలంబులు
రాల్చువిధంబున బదాతుల శిరంబుల నగలఁగొట్టుచుండిరి.
ముసలాయుధుండు భీష్ముని నొవ్వంజేసె. భీముని ంద్రోసె. అర్జు
నుని మోదె. హైడింబు పడఁ దూలించె. మురహరుఁడు గొడుగుల
పొడుచుచు సిడంబులఁ గూల్చుచు రథంబులఁ బొడిపొడి సేయుచుఁ
బెక్కురు యోధులం బరిమార్చుచుండె. అర్జునుండు కోపోద్దీపి
తమానసుండై రామసాత్యకులతోఁ బెనంగుచున్న యెడఁ బా
ండుసైన్యాటవుల దహింపజేసితినని నుత్సాహంబునఁ జెల్లారిన
క్రోధాగ్నితోఁ గృష్ణుఁడు మొగ్గరంబు గదియం బోవుచుండె.
భీష్మాదులడ్డగింప నవ్వీరవరుల నంపగమిం గప్పి నిశ్చేష్టితుల
నొనర్చి వారిం దాటి సూచీవ్యూహంబుఁ బ్రవేశించె. అట నెదురుప
డిన కేకయాదుల నిశిత శరాసనంబుల వంచె. వారలం గడచి

చను నెడసుదక్షిణుం డడ్డంబువచ్చె. వచ్చిన యాతనినొకళరాస నంబునం జచ్చినయట్లుండంజేసె. అంతధర్మనందనుండును గవ లును దారసిల్లిరి. వారల బాణసముదాయంబులనొవ్వంజేసి పద్మవ్యూహంబుం జేరి పాంచజన్యంబొత్తె. అటంగలసైన్యము కృష్ణునిం గాంచి బెబ్బులింగన్న మృగంబులుపోలెం జెదఱనుం టం బాండవమధ్యముండు గాంచి కుండినేశ్వరుండు చచ్చె నేమోయను భయంబునం దనతోం బోరుచున్న సాత్యకి నీరసా ములనటవదలి రయంబునసందేగి సైన్యంబునుంబురికొల్పి గజ గజవడంకుచున్న చతుర్థన జననాథుని వెన్నుజఱచి కృష్ణునిం గవిసె. ఇంతలో రాముండును సాత్యకియుం గృష్ణుంజేరవచ్చిరి. ఆసమయంబునకు భీష్మాదియోధవీరులుకూడ సవ్యసాచిం జేరిరి. సాత్యకిధృష్టద్యుమ్నులు సింగంబులభంగి నార్చుచు వివిధగతు లంబోరుచుండిరి తీవ్రగమనంబునం దేరునటునిటు బఱ తెంచుచు గజంబుల్వ్రచ్చుచు యోధుల నుగ్గుసేయుచు రణకేళి యొనర్చుచున్న రామునికి ఘటో త్కచుం డడ్డుపడియె. వానితురంగంబుల వధించి పైకుఱికి కోదండంబు విఱిచి హాలంబును విసరిన నాప్రేటువెన్నునకుర దగుల నాతండు చలించిన మనంబున నీడుచున్న చేలంబును గూడం బాటింపకం దండ్రితేరుసమీపింప నాతండుఱికె. అట గృష్ణుం డచ్చతుర్థనుం జేరంరాంగ ధనంజయుండు దేవదత్తంబు పూరించి సారవంతంబగు సాయకంబున దారకు నొవ్వనేసె. హాయమ్ములంగూల్చె. దానం గృష్ణుడరుణలోచనుండై యప్పా రుపైనాగ్నేయాస్త్రంబుం బ్రయోగించె. అయ్యది యగ్ని

జ్వాలలం గ్రక్కుచు బయలువెడల సైన్యంబులు భిన్నభిన్నం బులై యనురులరక్షించుకొనుటకుం జెదరిపాఱిరి. అర్జునుండు కోపగించి యద్దానిపై వారుణాస్త్రంబు ప్రయోగించె. లోకం బంతయు తిమిరమయంబయ్యె. వనజాక్షుఁడయ్యది వారింప నమోఘంబగు వాయువ్యాస్త్రంబుం బంచె. ఉగ్రుండై యర్జునుండు తన్నివారణమునకై నాగాస్త్రంబు జేసె. గోవిందుడద్దాని భయంబుఁ బాప గారుడాస్త్రంబు జేసె. అర్జునుండు దానిని నైంద్ర బాణంబునఁ దుత్తునియలుఁ జేసె. తుదకు యాదవనాయకుండలిగి బ్రహ్మాస్త్రమును వదలె. ప్రతిశరము లేకునికి ఫల్గుణుండు నా బ్రహ్మాస్త్రంబునే యభిమంత్రించి వదిలె. అవిరెండును గొండొకతడవు పోరాడి యఖిలదేవతలాశ్చర్యంబునొందఁ దమకుఁ దామే శాంతమయ్యె.

అంత నుక్కుమ్మడిగ భీష్మాదులు చుట్టుముట్టి కృష్ణునిపైఁ గ్రూరనారాచంబులఁ జొనిపిరి. అతండును జలింపక నిప్పులవంటి బాణములచే వారల నివ్వెరగందఁ జేసె. వైరులు ముప్పిరిగొన్న బలంబునఁ గృష్ణుని సారథిని తురంగంబులను గాఢముగ నొవ్వం జేసిరి. కృష్ణుండు ప్రళయకాలుండై ఘోర చక్రంబుఁ జేబూని యుధిష్ఠిరుం దక్క నెల్లవారినిం జెండ నమ్మని ప్రయోగించె.

గీ॥ మున్ను మున్ను ననేక మైమంటలెగయు
చక్రమే తేరఁగాఁ జూచి సవ్యసాచి
యున్న యత్నంబులన్నియు నుడిగి యాచ
తుర్థునిఁ దన వెనుకకుఁ ద్రోచి నిలిచె.

అట్లేతెంచిన చక్రము కుండినభూనాధునకడ్డమై నిలిచిన గాండీవిని హరించి చతుర్ధుని కంఠంబుఁదునిమె.

చ॥ నరునిశిరంబుకేశవ వినాయకకేతన చక్రిదైత్యసం
హరపరమాత్మ మాధవమురారి సరోరుహపత్రనేత్ర భూ
ధరధర యిందిరారమణ దానవవైరి యటంచుఁబల్కు చు
ధరపైఁ వ్రాలె నంతట సుదర్శన ముగ్రతవిూఁ బ్రవేల్మి డి

గాంగేయాదుల నెల్లర గీటడంచె. నిలింపాదులు భీతిల్లిరి. నెత్తుటేరు బాఱునెడ మానవులయొక్కయు జంతువులయొక్కయు శిరంబులును మెడలును తొడలును బొమ్ములును చూర్ణంబులైన గొడుగులును కేతనంబులును నందుఁ గొట్టుకొనిపోవుచుండె. తాను దప్ప తనబలంబునుసర్వంబును సుదర్శన నివృత్తంబగుట ధర్మనందనుఁ డెఱింగి మృతులైన గురుపితామహజ్ఞాతి బంధుమిత్రామాత్యుల నానాదేశాగత రాజన్యులంగనుంగొన రథంబుడిగ్గివచ్చి మహాశోకాకులసంతప్తమానసుండై గాంగేయుం గనుంగొని మూర్ఛఁజెందికొంతతడవునకుం దెలిసి కన్నీరుఁ గార్చుచు నాతని పాదంబులపైఁబడి విలపించుచునిట్లనియె.

తే॥ గీ॥ అనఘ స్వచ్ఛంద మరణుండ వవనిఁగల్గు
మగలకెల్లను మగఁడనఁ బొగడనెగడు

పరశురాముని గెల్చిన బాహుబలుఁడ
వైననీవును బొలిసితేముందు విధిని.

అంతనచ్చోటుఁబాసి గురుకృపాశ్వత్థామకర్ణ దుర్యోధనాదులంజూచి "అయ్యో నేనెంతపాపాత్ముఁడను! నానిమిత్తంబునఁగదా వీరెల్లరు గతజీవులైరి. ఈపాపంబునన్నెట్లు వీడుదు? సుదర్శనచక్రరాజమా! మహాపాపాత్ముండవనియా నన్ను స్పృశింపనొల్లక స్వామింజేరితివి?" అనిచింతించుచుఁ బెల్లుగఁ దల్లడిల్లుచుండె. ఆపిమ్మట నందుండి ముందఱకేగి కూలినశాల్యబలంబును మావంతులతోడఁ బీనుంగులై యేనుఁగులంగాంచివిలపించుచు నచటభీమసేనునిఁ గవలంగాంచి కూలఁబడి యిట్లనుచు శోకింపఁదొడంగె. "తమ్ములారా! మీమరందలెట్లగుటవినిన తల్లియు ద్రౌపదియు నేమగుదురు? పాషాణహృదయుండనగుట నేనిట్లు నిలిచియుంటి.

సీ॥ దుర్యోధనుండు బద్ధునిఁజేసి ముంపహా
నదినుండి వచ్చిననాటి శక్తి
మమ్ములాక్షానివాసమ్మునఁ గీడుచెం
దకయుండఁ దెచ్చిన నాఁటిశక్తి
వనమధ్యమున హిడింబుని యుద్ధమునను బ్రా
ణములనుగొన్నట్టి నాఁటిపెంపు
నంతిపురీజనులంత సంతోషింప
బకునిజంపినయట్టి బాహువీర్య
మివ్విధంబున మడఁగె నేఁడెచటికేగె
నేతెఱంగునడాగె నేఁడెచటనడఁగె

హా! మదేభాయుతత్రాణ హా గదాప్ర
వీణ హా! వీర హా! జగత్ప్రాణతనయ

గీ॥ నకులసహదేవులార ఖండనపటిష్ఠు
లార సౌందర్యలక్ష్మీకుమారులార
పోయితిరె మీరు నేఁడు నాపొందు విడిచి
యంచు విలపించు నలుదిక్కు లాలకించు.

ఇవ్విధంబున రోదనంబు చేయుచుఁ గొన్ని యడుగులు నడిచి చతుర్థనుం గనుఁగొని పుడమిం బడియిట్లనియె. "కుండిన నాథా! నిన్గావఁ బ్రతినఁబూనిన యర్జునుండు మే నాయువులు న్నంతవఱకు నిన్ను రక్షించి తుదకుఁ బ్రాణము లర్పించె. కలుషా త్ముండనగు నేను నిర్వ్యాజకుండనై నిన్నుఁ బ్రతికింపలేకఁ బోతి. వంగడంబునకు నపయశస్సుం గూర్చితి"

అంతనాదండం బడియున్న నరుకళేబరంబు దగ్గఱంజని తచ్ఛరీరంబు తనయంకతలంబున బెట్టుకొని యుమ్మలికం బధికంబగుడు సొమ్మసిలి పెద్దకాలంబునకుఁ దెలివినొంది నేత్రంబులనుండి కన్నీరుగాఱ హోరుమని యేడ్చి యిట్లనియె.

సీ॥ ద్రోణశాసనమున ద్రుపదుఁ దెచ్చినయట్టి
నీభుజావిభవంబు నేఁడడంగె
నంగారపర్ణుని భంగపెట్టినయట్టి
నీ దివ్యశక్తిదా నేఁడడంగె
దారుణమత్స్యయంత్రం బేసిమించిన
నీశరాసనదీప్తి నేఁడడంగె

పాంచాలికై మహీపాలురగెల్చిన
నీవిక్రమస్ఫూర్తి నేఁడడంగె
హా సరోజాత వైరికులావతంస
హా భుజోద్దండ పరిపంథిరాజహంస
హా మహాశౌర్య హా సురాహార్యధైర్య
హా జయద్వీర హా హరిహయకుమార!

ఇట్లు పలువిధంబుల నాతనిం దలఁచితలఁచి రోదనంబు సేయుచున్న నమ్మేకినీనాథు దైన్యాలాపంబులు బలభద్ర సాత్యకులు విని కృష్ణునిపాలికిం జని చక్రధాటికిఁ దప్పించుకొని యెవ్వఁడో యొకఁ డింద్రసుతువాహినిం గద్గదకంఠమున నేడ్చుచున్నాఁడని తెల్పిరి.

కృష్ణుఁడు— సోదరులారా! ఆయేడ్చువాఁడు ధర్మరాజు. మనమేగి యాతని నోదార్చుదము రండు.

అట్లగు నెడఁ కృష్ణుఁ డాత్మసేనా మధ్యంబునఁ బడియున్న చతురంగబలంబులను యాదవవీరులం గనుఁగొనుచు శోకవ్యాకులిత మనస్కుఁడై పాండవబలంబుఁ దఱియఁ జోవుచు సోదరులకు గాంగేయాది ప్రముఖులఁ జూపుచుఁ బాఁడరియున్న పార్థు తేరు చేరంజన యమనందనుఁడు లేచి తనతోడపైనున్న విపచ్చుశిరము యదువీరుని రథంబుపై నిడి యశ్రుపూరిత లోచనుండై హరిపాదములపై వ్రాలి దీనుండై యిట్లనియె.

గీ॥ అఖిలభూతసముఁడు నవవర్గదాయకుం
డంబుజాతనేత్రుఁ డనుచుఁ బలుకు

మాటదప్పకుండ మాధవా నను జక్రి
కోటిద్రుంచి వీరిగూడ నంపు.

ఉ॥ తమ్ముఁడు రాజులుం దెగిన దానికి నీగతి నిల్వలేక శో
కమ్మున నుంటగాదు తనుఁగావుమటంచుఁ జతుర్థనుండు ప్రా
పమ్మన నన్నుఁ జేరె మనుజప్రభుఁడంచును నిట్టివానిఁ జ
క్రమ్మన కప్పగించితిఁ బ్రాణము లేటికి నాకు మాధవా.

అట్లనిన యమనందనునికిఁ గృష్ణుఁడిట్లనియె.

ధరణీశ్వరా! నీకిష్టమైనవాని నొక్కనిఁ గోరుకొనుము. పునర్జీవితు నొనర్చెద.

ధర్మరాజు—దైత్యాంతకా! చతుర్థునిమ్ము. మహాప్రసాదము.

కృష్ణుఁడు—హా! ఇదేటి వెఱ్ఱి! గురుకృప భీష్మాదులను నిజసోదరులను సుయోధనాది నిజబాంధవులను విడనాడి యాతని గోరుటేటి న్యాయము?

ధర్మనందనుఁడు—పద్మనాభా! నాకందఱి కంటె నాతఁడే యెక్కువ. అతని నిచ్చుటయే నాకు బ్రహ్మపద మిచ్చినట్లు.

కృష్ణుఁడిట్లనియె.

గీ॥ సర్వభూతదయాపర సత్యసంధ
రాజపూజిత పదపద్మ రాజితనయ
శోధనాకార నీచిత్తశుద్ధికాత్మఁ
జాలమెచ్చితిఁ గుండినేశ్వరునితోడ॥

క॥ జీవించుఁగాత మర్త్యుల
జీవాత్ములుఁగాఁగ నుభయసేనలునిపుడీ
దేవాధిపశంకరవా
ణీవల్లభు లాత్మలోన నిర్వైరగంధ॥

అని శ్రీకృష్ణపరమాత్మ వచించిన తోడనే సకల జనంబులును చచ్చుటయు బ్రతుకుటయు నెఱుంగక ప్రథమవైరంబు నే మది నెంచి రోషంబునఁ గలియబడుదాదర ధర్మజాదులు హాలధరుండును వారల నివారించి పలినాత్ము మహిమచేఁ జరిగినకథాంశంబు విప్పిచెప్పిరి. సకలలోకాధ్యక్షుండగు పుండరీకాక్షుని యక్షీణప్రభావంబునకుఁ బురందరాదిబృందారకులమందానంద కందళిత హృదయారవిందులై ప్రసూనవర్షంబు గురియించిరి. అంత సుయోధనాది ధార్తరాష్ట్రులును, యుధిష్ఠిరాది పాండవేయులును, ద్రుపదవిరాటాది నానాధీశ్వరులును, గాంగేయాదులును సద్దేవదేవునకుఁ గృతప్రణాములైనిలిచిరి. విజ్ఞాననిధియగు దేవవ్రతుండు కృతాంజలియైయాతనియవతారంబులెన్నుచు బహుభంగుల బ్రస్తుతించె. అట్లువినుతించు నప్పరమభాగవతుని యాదవనాయకుండు మృదుమధురభాషణంబుల నాదరించె. ధర్మజభీమదుర్యోధనాది సకలరాజన్యుల నుచితప్రకారంబుల సంభావించె, చిన్నవోయియున్న యర్జునునిఁ జేరందీసి యాలింగనంబొనర్చి హృదయానందంబుగావించె. చరణంబుల కెఱఁగిన చతుర్థుని మన్నించె. అందున్న వారి నెల్లరఁ దనతో ద్వారకకుఁ జనుదేరఁ

గో॥ర. అట్లుచేరినవారినెల్లఁ గృష్ణుండు ద్వారకయందు గౌరవించి పంపె.

క॥ అని శుకయోగీంద్రుండ
య్యనిమిష రాజ్పుత్రునకుఁ దయాపరుఁడై చె
ప్పినవృత్తాంతము నంతన
మున సూతుఁడు శౌనకాది మునులకుఁ జెప్పెఁ

సేస్తమును చుట్టరికమును గురుస్థానమును స్వార్థమును త్యజించి, యసువుల నైన లెక్కింపక శరణాగతుని రక్షింపనుంకించిన యర్జునుని సామర్థ్యంబును, ధర్మరాజు ధర్మబుద్ధియుఁ, గష్టకాలంబున దుర్యోధనాదుల సౌహార్దంబును శ్రీకృష్ణుని పరాక్రమ మహిమాదులను మునివరేణ్యులు వేభంగులఁ గొనియాడిరి. ఈ చిత్రభారతం బతివిచిత్రంబని విస్మితహృదయులైరి.

---

సంపూర్ణము.

---





## శ్రీ వల్లి వేంకట సుబ్బారాయ కృతగ్రంథములు.

1 సువర్ణముఖి. (నవల) 0-12-0

2 గంగాబాయి. (నవల) 0-12-0

3 దుర్యోధన పరాభవము. 0-10-0

(ఐదుఅంకముల నాటకము)

క్రొత్తనాటకము! క్రొత్తనాటకము!

బుద్ధిసాగరవిజయము. 0-12-0

(ఐదుఅంకముల నాటకము)

---

## రాబోవు గ్రంథములు.

1 హనుమద్విజయము (వచనము)

2 త్రిభువనము (నవల)

వలయువారు:—

పి. వి. రమణయ్య అండు సన్స్,

గుంటూరు.